నాట్యభారతీగ్రంథమాలిక. సంపాదకుఁడు- విశ్వనాథకవిరాజు

ప్రథమ పుష్పము

# ఆశ్చర్యచూడామణి.

శక్తిభద్రకవిప్రణీతము








కవిరాజ మల్లాది వెంకట విశ్వనాథశర్మచేఁ

[illegible]

శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాల

రాజమండ్రి.

1931

 [వెల రు ౧

# ఆశీస్సు.



విజయనగరకలాశాలాసంస్కృతాంధ్రపండితులగు బ్రహ్మశ్రీ మల్లాది విశ్వనాథ కవిరాజుగారిచేఁ జేయఁబడిన శక్తిభద్రకవికృతాశ్చర్యచూడామణి యాంధ్రానువాదము సాకల్యముగ వింటిని.

భాసకాళిదాస భవభూత్యాదులతో సదృశప్రతిభావంతుఁడగు శక్తిభద్రుని సంస్కృతగ్రంథముయొక్క యుత్కర్ష ప్రసిద్ధముగాన ప్రశంసింపఁ బనిలేదు; కాని నాటకసందర్భకల్పనయం దీమహాకవికిఁ గల నైపుణ్య మసదృశమని చెప్పక తీఱదు.

అనువాదకులును, ప్రసిద్ధాంధ్రగీర్వాణపండితులును, అనేకాంధ్రగ్రంథకర్తలును మహాకవులును, అభినవ విరూపాక్ష పీఠాధిష్ఠాతలగు శ్రీనృసింహ భారతీ శంకరాచార్యులవారి మెప్పు వడసి కవిరాజ బిరుదము నందినవారును; అగుటచే వారిని గూర్చియు నధికముగాఁ జెప్ప నక్కఱలేదు. అయినను తదీయానువాదశ్రవణజనితానందప్రేరితుఁడనై నాసంతోషమును బ్రకటించుట నాధర్మ మని యెంచి సప్రశ్రయముగా రెండుపంక్తుల వ్రాయ నుత్సహించినాఁడను.

ఆంధ్రగీర్వాణములలో కవిరాజుగారిసాహిత్యము సమగ్రమును సర్వతోముఖమును- కవిత్వధార యనర్గళము- శైలి మృదుమధురము- అనువాదము స్వతంత్రగ్రంథమువలె ధారాళముగా సాగి హృదయంగమముగ నుండి సర్వవిధముల శ్లాఘ్యముగ నున్నది.

ప్రతిభాశాలియగు నీగ్రంథకర్తగారికి, సర్వకల్యాణసంధాయకుఁడగు పరమేశ్వరుఁ డాయురారోగ్యముల నొసంగి యింకను ననేకగ్రంథములు రచింప నవకాశము గల్గించి, యాంధ్రలోకమున కమందానందము గూర్చుగాత !

భీమవరము }<br>
9-5-1931 }

చెన్నాప్రగడ భానుమూర్తి బి. యల్. ఎ. టి<br>
Retired Telugu Translator to Govt.





ఈనాటకము నెవ్వరేని బ్రయోగింపఁ దలంపుఁగొన్నఁ దొలుదొల్త నే నా కెఱింగింతురుగాక. రంగప్రసాదనవిషయమునను ప్రయోగసందర్భమునను గొన్నిసలహాల నీయఁ గోరుదును.



గ్రంథకర్త.





# భూమిక.

" త్రొల్లిటిసత్కవుల్ నలఁగఁ ద్రొక్కినదే యని రామగాథదా
రొల్లరయేని రామునకు నుద్ధగ నాయకుఁ డెందుఁ గల్గునే?
సల్లలితోల్ల సద్గుణవిశాల గభీర మనోజ్ఞ భారతీ
వల్లభులౌ కవీంద్రు లది వ్రాకొనకే చరితార్థు లౌదురే? "

అనుమురారి మహాకవివచనమే ముఖ్యకారణ మగునేమో-సుప్రసిద్ధులగు నాటకకర్తలలో ననేకులు సంస్కృతమున రామాయణ నాటకములు వ్రాసిరి. భాస, భవభూతి రాజశేఖర మురారి జయదేవాది మహాకవులు వ్రాసిన రామనాటకములు మనకు సుపరిచితములే. ఇవిగాక హనుమన్నాటక జానకీపరిణయ రాఘవాభ్యుదయాది నాటకము లొకయేఁబదియైన నున్నవి. ఒక్కయితివృత్తమునే యిందరు కవులిన్ని గ్రంథములుగా వ్రాసినను- ఇందలివిశేష మేమనన్నియు రసభావకల్పనావిశేషములచే వేర్వేఱుగనే గన్పట్టి యపూర్వస్వరూపభావముల విలసిల్లును! కావుననే యిన్నింటికి నాస్వాదనీయత యేర్పడుచున్నది. ఈరామాయణనాటకమాలయం దొకమణి-యట్లననేల- నాయకమణియే యనందగినది-

## ఆశ్చర్యచూడామణి

ఇందలి యితివృత్తము సీతాపహరణము మొదలు సీతాస్వీకృతిపర్యంతముగాఁ గలరామాయణకథ.

ఇందలి విశేషమేమన నిట్టికథాకల్పనము సంస్కృతనాటకములలో నరుదు. ఇందు మూఁడవదియగు మాయాసీతాంకమున రాక్షసులచే మాయావేషములు ధరింపఁజేసికవిచూపినకౌశల మప్రతిమానము. ఇది Shakespeare మహాకవి తన Comody of Errers. అనునాటకమునజూపిన నేర్పు నతిశయించుచున్నది. ఇందలి యింకొక నూతనకళయే మన-నాటకమున శృంగారముగాని వీరముగాని ప్రధానరసముగా నుం

డవలయునని యాలంకారికనియమ ముండ నితఁ డద్భుతమును ప్రధానరసముఁ జేసినాఁడు. ఇది యాశ్చర్యచూడామణి యను పేరువలననే తెలియవచ్చుచున్నది.

‘ నాట్యంశీతే. ప్రతిష్ఠిత ’ మ్మను వాక్యము నందలి పరమార్థమును బాగుగ నెఱింగిన నాటకకర్తలలో నీతఁడు శూద్రకుని తరువాతి వాఁడు.

కావుననే యీనాటకరాజము శాక్యారులని పిలువఁబడు నటులచే నేఁటికిని కేరళదేశమునఁ బ్రదర్శింపఁ బడుచున్నది. రామాయణ నాటకములలో నెల్ల నిదియే యత్యంతముఁ బ్రయోగానుకూల మైనదని పండితులు భావించుచున్నారు. శక్తిభద్రుఁడు నాటకకర్తలలో నెల్ల నగ్రగణ్యుఁ డను ప్రతీతి కేరళదేశమునం దెల్ల నిండియున్నను నితఁడు దాక్షిణాత్యుఁ డనియు, 1100 సం॥ క్రిందటివాఁ డనియు శంకరాచార్యులశిష్యుఁ డనియు- ఉన్మాదవాసవదత్తమను కావ్యమును వ్రాసెననియుఁ గాక యితరమేమియు నితనిగూర్చి యెఱుఁగరాదు. ఉన్మాదవాసదత్త యిందనుకఁ గనంబడ లేదు. ఈయాశ్చర్యచూడామణియు నైదేండ్లక్రిందటివఱకుఁ బ్రకాశనదశకు రాకున్నను దాని నెట్లో సంగ్రహించి ప్రకటించిన బాలమనోరమాసంపాదకులు ప్రశంసనీయులు. తొలుత నీగ్రంథము నాంధ్రీకరించు భాగ్యము నాకుఁ గల్గుటచే నేను కృతార్థుఁడను. ఈనాటకముపై విపులమగు విమర్శనమును మున్ముందుఁ బ్రకటింతును. ఇందలి గుణమెల్లశక్తిభద్రకవిది. దోషముల స్వామ్యము పూర్తిగ నాదే! దోషముల సహించి గుణముల గ్రహింప తద్జ్ఞల నిత్యముఁ బ్రార్థింతును.

విజయనగరము
20—4—31

కళోపాసకుఁడు,
విశ్వనాథశర్మ.

మూఁడున్నఱయేండ్లు నన్నానందాంబుధి నోలలాడించి

యువ్వెత్తుగ

నన్ను శోకసాగరమున ముంచిన

నా మూఁడవ కుమారుఁడగు

నా ఛత్రపతి శివాజీకి

స్మారకచిహ్న మీచిన్ననాటకము.

విశ్వనాథశర్మ.

# పాత్రములు.

రాముఁడు
లక్ష్మణుఁడు
జటాయువు
సుగ్రీవుఁడు
విభీషణుఁడు
నారదుఁడు
విద్యాధరుఁడు
ఋషికుమారుఁడు
వృద్ధతాపసుఁడు
రావణుఁడు
సూతుఁడు
వర్షవరుఁడు
అమాత్యుఁడు
మాయారాముఁడు (రావణుఁడు)
,, (మారీచుఁడు)
మాయాలక్ష్మణుఁడు (సూతుఁడు)

సీత
సౌదామిని
మండోదరి
చేటి.
శూర్పణఖ :—
1 లలితవేష
2 స్వస్వరూప
3 మాయాసీత

☞ ఇందు మాయావేషములు ప్రత్యేకవ్యక్తుల చేతనే చూపింపఁబడఁ దగును.

ఓమ్

నమశ్శివాయ

# —•ఆశ్చర్యచూడామణి•—

స్థాపన

—)o(—

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సీ. దీపదమ్మైన విమల గారుడ మణి
పరిఘాయత సహస్ర బాహు లమర
ఫేనసంచయము చందాన శుభ్ర ద్యుతి
హారజాలములు పై నవఘళింపఁ
ప్రస్ఫుటానంత హీరరత్న కాంతుల చేత
నగుణేమం బంతట నావహిల్ల
శంఖ మ్మొసఁగఁ జరాచరము లనిరాఘ
మేయ తేజమ్ము లో నిండుకొనఁగఁ

దాన యొక సముద్రమ్ము చందాన నుండి
తత్సముద్రమ్మునం దొక్క తావునందుఁ
జక్కఁగాఁ బవ్వళించిన శార్ఙ్గపాణి
స్థిరకృపాబుద్ధి మిమ్ము రక్షించుఁగాక.

(పరిక్రమించి నేపథ్యాభిముఖముగాఁ జూచి)
ప్రియా! ఇటు వత్తువా?

(నటి ప్రవేశించును)

నటి.— ఆర్యా! ఏమి సెలవు?

సూత్ర... సుందరీ !

గుణలబోధ సహాయులకూర్మికలిమి
నాదిభరతాదిమహాసీయు లవధరించు
ప్రకృతిరంజన మను సమధికభరమ్ము
నృపునిచందాన నే నుద్వహించుచుంటి.

నటి... ఆర్యునిపూనిక నాకారమే సూచించుచున్నది.

సూత్రి... అవును ప్రేయసీ ! అసాధారణముగుమార్గ మ్మనేకులకు దుర్గమముగదా !

నటి... ఆర్య ! ఏది యసాధారణమార్గము ?

సూత్రి... 'దక్షిణాపథమునుండివచ్చినయాశ్చర్యచూడామణియనునాటకము నభినయించి సౌభాగ్యము రెట్టింతురుగాక' యనియార్యమిశ్రులశాసనము.

నటి... ఇది యెన్నటికిని జతపడనిదిగదా! దక్షిణదిశనుండియే నాటకనిబంధనమువచ్చిన నాకసము పూవు పూయును; ఇసుక తైలమిచ్చును.

సూత్రి... ప్రేయసీ! అటుకాదు. గుణము లేఱుము; జన్మాభినివేశము జాఱవిడువుము.

గుణములె ప్రమాణముగుఁగాని కుందరదన!
కాదు దిగ్విభాగమ్ము; తార్క్ష్యాణ యిదియె
నీస్తనద్వయి నొప్పుగా నివ్వటిల్లుఁ
జంద్రపాండరహారమ్ముఁ జందనమ్ము.

నటి... అవును. ఆదేశము రత్నాకరముగదా! నాథా! ఎవరాకవిప్రతిన పరిజ్ఞారూపమును ధూపపునెత్తమున్న దేశాంతరమునకుఁ బంపఁ గోరుచున్నాఁడు?

సూత్ర... ఉన్మాదవాసవదత్త మొదలగు కావ్యములు వ్రాసిన శ్రీశక్తిభద్ర
కవి ప్రజ్ఞావిలసితమిది. ఆ మహామహుఁడు.

వేదశాస్త్రపురాణవిద్యాప్రపూర్ణత
ద్విజుల కాదర్శమై వెలయువాఁడు
శంకరాచార్యహస్తసరోజజాతుఁడై
జ్ఞానవిస్ఫూర్తి నెసంగువాఁడు
భారతీకరుణాసుధారసస్నాతుఁడై
కాళిదాసాదులఁ బోలువాఁడు
వాల్మీకిమునిపదోపాసనానందుఁడై
నిస్తులప్రతిభ నెగడువాఁడు
కల్పనాశిల్పమునఁ బేరుఁగన్నవాఁడు
అమలభావంబులకు గనియైనవాఁడు
తానరసమున్న శ్రుతికెని దగినవాఁడు
భద్రగుణసముద్రుఁడు శక్తిభద్రసుకవి.

కాన నీవును పాత్రములదెస సావధానవు కమ్ము. నేను నార్య మిశ్రుల కొకవిన్నపము చేసికొందును. ఇదేమి! నేను విజ్ఞాపన వ్యగ్రుఁడనుగాఁగా శబ్దము వినవచ్చు చున్నట్లున్నది.

(నేపథ్యమున జ్యాఘోషము)

సూత్ర... సరే తెలిసినది-

భార్యతోనున్న శ్రీరామభద్రునకును
బ్రీతిమైఁ బర్ణశాల నిర్మించుపొంటె
జ్యావినిర్ఘోషమున నె లక్ష్మణుఁడు బళిర!
వన్యజంతుసంతానమ్ముఁ బాఱఁదఱుము.

(నిష్క్రమింతురు.)



# ప్రథమాంకము.

---

(ధనుర్బాణపాణిలక్ష్మణుఁడు ప్రవేశించును)

లక్ష్మ ... జ్యానాదమ్మునఁ బాఱఁదోలెదను బర్యంతోగ్రసత్త్వాళి; సం
ధానింతుం బాలుపాఱఁ బర్ణగృహమున్; గల్పింతుఁ బూఁబానుపున్
వే నిర్మింతును సంయమీశ్వరులకున్ వేత్రాసనం; బీగృహ
స్థానంబుం గయిసేతు నంబుజరజస్సక్తాంబుసిక్తంబుగా.

(అటు చేసి)

ఎట్టెట్టో యార్యునియాజ్ఞ నీవిధముగ నెఱవేర్చితిని. ఓహో! విపన్నులయవస్థ బుద్ధిని వర్ధిల్లఁ జేయునుగదా! గోదావరీతట ప్రదేశమున నొక్కచోఁ బూజ్యురాలితోఁగూడ నిలిచి తరంగ మారుతములచే నడకబడలిక వాపుకొనుచున్నయన్నగారికిఁ బర్ణశాలానిర్మాణము పరిసమాప్తమైనదని యిదే విన్నవింతును.

(పరిక్రమించి చూచి)

అహో! అరణ్యవిరుద్ధ మీయాకారము!

వాలుఁగ్రాలు గనులు వంగినకనుబొమ
లుబ్బుమీఱు పృథుపయోధరమ్ము
లనుఁగువగలుఁగలుగునాశ్చర్యమౌర! దీని
కాకరమ్ము దివియొ కాక భువియొ!

(చిత్తవికారము నిరూపించి)

ఏమిది ? నేను లక్ష్మణుఁడను-రామునితమ్ముఁడను,
ఈయెలనాగ భూమితలమేఁ ద్రిదశాలయమే సనాథముం
జేయునుగాక చాలుఁ జలచిత్తులకుం దగునీవితర్కముల్;

నాయనగారిమాట వనంబులఁ బ్రొనరింద్రముఁ డగ్రజుఁ
డాయనకే వశుండఁ గుసుమాస్త్రునకెట్లు వశుండవయ్యెదన్?

(శూర్పణఖ లలితసుకుమారవేషయై ప్రవేశించును)

(లక్ష్మణుని నిరూపించి)

శూర్ప-వాఁడే వీఁడు !

(సిగ్గు నటించుచున్నది)

లక్ష్మ... ఈమెధైర్య విపరీతముగ నున్నదే!

తాపసాచారతత్పరత్వమున నేను
గర మవజ్ఞాపరుమదృష్టి నరసియున్న
సిగ్గుమెయి వణఁకుచు నీమె శిరము వాంచు
శ్రీమరములు జాఱ నవతంససుమమునుండి,

శూర్ప... మఱి వీఁడే మనునో?......ఆర్య !

లక్ష్మ... ప్రాజ్ఞుఁడు స్త్రీలవృత్తాంతములఁ బ్రివేశింపఁడు.

(ఊరకపోవును)

(లక్ష్మణు నించుక యనుగమించి)

శూర్ప... ఆర్య! శరణుపొందినస్త్రీజనము నుపేక్షించుట లగునా ?

లక్ష్మ... కాదుకాదు. నేను నిన్నుపేక్షించుట యిపు డవస్థాంతరమున
శోచనీయుఁడగు గురుని యులంఘనీయశాసనమున.

శూర్ప... ఇదియు గురుజనుల యాజ్ఞయే.

లక్ష్మ... (రోషముతో) ఎవఁడు న న్నాజ్ఞాపించువాఁడు ?

(భయము నిరూపించి)

శూర్ప... ఆగ్రహింపకుఁడు. పూజ్యుఁడగు శ్రీరాముఁడు.

లక్ష్మ... ముం దీమె యార్యుని జూచినదా ? అగుఁగాక. మహాత్త
మాత్రమైన గురువచనగౌరవము నందినయీమెను బ్రసన్న
రాలి నొనర్తును...కల్యాణీ ! అన్నగారి యాజ్ఞయేమి ?

శూర్ప... ఆర్య ! మీరునాతోఁగూడి తనకుఁ బరిచరింపవలసినదని-

(హాస్యము పరావర్తించి)

లక్ష్మ... నారయచీర; పల్లె సదనంబులు; దుంపయుఁదూఁడుభుక్తి; లేఁ
బూరియె శయ్య; నీటిజడిఁబొల్చు జడ ల్సగ; లింతయేలనా
తీరు మృగాళితో డొకటె; తీరును నిర్జన; కామినీ! వ్రతా
చారులు మాను లేద? వ్రతశాంతవుఁ దంగజుఁడేడఁ? జెప్పుమా!

శూర్ప... కల్లకల్ల. ఆతఁ డావిడగారితో నుండఁడా?

లక్ష్మ... వారివృత్తమును నీ వెఱుఁగవు.

శూర్ప... ఏమది?

లక్ష్మ... ఆర్యుఁడు ప్రతినతీఱుదనుక నొక్క ధర్మము నే యవలంబించును.

శూర్ప... అయిన నామె యక్కడ నేమిచేయుచున్నది?

లక్ష్మ... నే నేమిచేయుచున్నాను?

శూర్ప... ఆమె వారి నెట్లుపచరించుచున్నదో నేను మి మ్మట్లుప
చరింతును.

లక్ష్మ... ఇదియు నొకకోరకయా?

దేనినిష్కృతికై ప్రయత్నించుచుంద్రు
ప్రకటమేధాసనాథులౌ సకలజనులు
నట్టిదాస్యమ్ము నీకు నీ వభిలషింతు
ముగ్ధలోచన! నీ వెంతముగ్ధ వొక్కొ?

శూర్ప... ప్రేమము గుణదోషములఁ దూఁచునా?

లక్ష్మ... ఇట్లు చెప్పుచున్నదే- ఈమె నెట్లు వదల్చుకొందును? అన్నగారు
పర్ణశాలఁ బ్రవేశించినవెనుక నిన్నుఁ గోరినయెడఁజూతును.

శూర్ప... అయినఁ బర్ణశాలప్రక్క నిలిచి నిరీక్షింతును.

లక్ష్మ... కానిమ్ము... ఈ బెడదఁ వదలినఁ జాలు... నీయిష్టము.

(శూర్పణఖ నిష్క్రమించును.)

లక్ష్మ... పరీక్షింపఁ దగినదే మె!

వనచరులకేరిఁ జొరరానివన మిదేద?
కువలయమనోజ్ఞనేత్ర యీాయువిద యేక?

అంబుజమరందమత్తయౌ నంచకన్నె
నన్ను నెవ్వఁడు జలధిఁ గన్పట్టునేని ?
ఇదే మొదట కనుకొన్నచోటు.

(సీతారాములు ప్రవేశింతురు)

రాము... దేవి! నగరాధివాసముకంటె వనాధివాసమే నాకు మిన్నయై కన్పట్టుచున్నది. ఏమందువా-

పలుపూవ్రాఁకులఁ జక్కవల్చునటవీభాగంబు లుద్యానముల్
సెలయేళ్ళన్నగి మబ్బులందగుగిరిశ్రేణుల్ విలాసాద్రులౌ
కలలం బెంచు మయూలపిట్టలను హంపా సేళ్ళు కేళాకుళుల్
వలితేఁ గమ్మనితమ్మితెమ్మెర లివే పంకాల మేల్పయ్యెరల్.

సీత... ఆర్యపుత్ర ! అయోధ్యను గురుజనము చింతిల్లకుండునేని యావజ్జీవమును నే నిచటనే నివసింపఁ దలంతును.

లక్ష్మ... ఇఁడుగో! ఆర్యుఁడు. ఆహా! దుర్విధదుశ్చేష్టితము- కాదుకాదు- కైకదుశ్చేష్టితము! ఎంతకష్టము! అమ్మా! కైకేయీ !

పసిఁడిహొంబట్టు దువ్వలువలు డిగనాడి
ఘనుఁడార్యుఁడు ధరించెఁ గాషికోక
పఉడులయరకాళ్ళగుఱుతు లేర్పడుపట్లఁ
జరియించు మాయన్న జానకమ్మ
బగబగమండించు వగలను సెగలచే
నగమయ్యె భరతుండు దిగులువొంది
పసిపాపలు మనస్సు పడఁతు లెల్లరును గ
గ్గోలొందుచున్నారు కోసలమునఁ
బాపఫలరూపమా ముండమోపితనపు
నెవ్వగకుఁ గైవసంబైతి నీవుగూడ

గానిమొకరిగా దెల్లరఁ గన్నుకొనియేఁ
శాపినీ ! నీదునమ్ముర్మ పాపుగాను !
ఆర్య ! జయము జయము.

రాము... లక్ష్మణా ! నీపూనిక ముగిసినదా ?

లక్ష్మ... చిత్తము.

రాము... అయిన దారిచూపుము.

(అందఱును బరిక్రమింతురు.)

(లక్ష్మణుని ముఖరాగమును జూచి)

రాము... వత్స ! లక్ష్మణా !

క్రతులన్ నిర్వృతిమార్గమార్గణపరబ్రహ్మణ్యులన్ మార్గసం
గతులం గొల్వఁగఁ దీర్థసింధుజలసాంగత్యంబునన్ శోకసం
గతి వాయన్ మిష నెట్టి యిటు మనకుం గైకమ్మ యిక్ష్వాకు లు
న్నతిభూభారము డించి పైకొనెడు వానప్రస్థముం బంచెఁ బో!

లక్ష్మ... లోకము నిజమే చెప్పుచున్నది- గుణవంతుల కవగుణంబులు కన
రావని.

రాము... ఏమియిప్పటికిని నీకుఁ దల్లిగారిపైఁ గోపము చల్లారలేదా?

లక్ష్మ- ఆర్య!

పమ్మిన వేడ్కఁ జేఁపురకు వచ్చినతల్లులపాలతోఁడ, హా
ర్దమ్మునఁ దండ్రి కన్గవను జాల్కొనుస్రుశులతోఁడ, హేమభాం
డమ్మునుండి నీశిరసునం బడునీటిచ్రుటిన్ వసిష్ఠుమం
త్రమ్ము జయించు మంత్రమునఁ దద్దయు నంకిలి వెట్టుదాని నే
నమ్మ యటంచు నమ్మఁగలనా జగదుత్సవకాలయామినిన్?

రాము... (చెవులు మూసికొని) పాపము శాంతించుఁగాక.

పాడురాజ్యమ్ము దెసఁగల్గుభక్తిచేతఁ
బ్రల్లదము లాడెదవు కన్నతల్లి నీవు
దుర్భర మ్మౌర! సంతోషదూరులకును
హృదయ మేమెడనే నథ్యైకరతమ్ము

చూడు బాలకా! పాపాత్ముఁడగు క్షత్రియునకు-
నీతివిదు లెల్ల భోగించు నేల యాలు;
హితులు శత్రువుల్; సహజులు సుతులు రిపులు;
పరులపాపానఁ దనకును నరకబాధ;
తుంచె లోకరెండు నొకవెల్లగొడుగు మిగులు.

లక్ష్మ... నేను రాజ్యాభిలాషమునఁ బలికినది గాదు.

రాము... అయిన నీకోపమున కిఁకేమి కారణము?

లక్ష్మ... వరుస తప్పినదని.

రాము... అట్లయిన నన్నుగదా మొదట నిందింపవలయు-

ఇంద్రసంకాశుఁడగు ధాత్రీంద్రుఁ డట్లు
స్నేహపర్యశ్రునయనుఁడై చింతనిలువ
సిగ్గుఁ బోనాడి పట్టాభిషేకమునకు
నధివసించితి నేను సింహాసనంబు.

సీత... ఆర్యపుత్రుఁడు చెప్పినది నిజమే.

లక్ష్మ... 'పెద్దవాఁడనైతి'నని తండ్రిగారే కదా యేర్పాటు చేసి'.

రాము... అట్లయిన భరతుఁడు నాకంటెఁ జిన్నవాఁడు కదా!

లక్ష్మ... 'నేను భూమిపాలించుట కశక్తుఁడ' ననికూడ వాఁగు—

రాము... బాలకా!

దానవోన్మూలనం బైన యోని తేజ
మమరలోకంబునకు నెల్ల నంగరక్ష
యతఁడు రక్షింప వలఁతిగాఁ డయ్యెనోటు
తన్ను దేవతగా నెన్ను ధరణీతలము?

లక్ష్మ... ఇంకేమనఁ బుత్రస్నేహమున నిట్టిచాపల్యము చూపఁబడినదని

రాము... ఇది లోకస్వభావము- పలువురు కుమారులలో నొకనియందు
పక్షపాతము. నీకు భ్రాతృస్నేహము సమానమా యేమి?

లక్ష్మ... ఎన్నివిధములఁ జూచినఁ దండ్రిగారివృత్తి కామమే కాని

రాము... కాదుకాదు తండ్రిగారియెడ నాను నిరపరాధలు.

కన్నులు గానవట్టిముదుకల్ తలిదండ్రులు నీరు గోర నా
సన్ననదిఁ సుతుండు కలశంబును ముంచినసద్దు - వేఁగ కే
మున్నుగ వేఁటకేగినన్నృపుఁ డవనదంతిగ భ్రాంతివెట్టఁ దాఁ
గ్రన్ననఁ జిమ్మె న మ్మెదియె కాలమునన్ నృపుప్రాణముల్ గొనెఁ

సీత... అవును. అట్లయై యుండును. కాకున్నఁ గోరికోరి యెవరై తాను చెడి లోకమును జెఱచును ?

లక్ష్మ... నేనే యపరాధిని. ఆర్యుఁడు ప్రసన్నుఁడగుఁగాక. కథాప్రసంగమున దూర మెఱుఁగకయె పర్ణశాలఁ జేరితిమి. ప్రవేశింపుఁడు.

రాము... ఇంక నీ వలయిక దీర్చికొనుము.

లక్ష్మ... చిత్తము. (నిష్క్రమించును)

(పర్ణశాలఁ బ్రవేశించి యంతటఁ జూచి సవిస్మయముగా)

రాము... దేవి! చూడుచూడు- లక్ష్మణుని సర్వతోముఖనైపుణ్యము !

జ్యావినిర్ఘోషమునఁ బాఱె సత్వచయము;
పర్ణముల శాల శయ్య పుష్పముల నమరె;
వేత్రముల నాసనం బిదే వెలసియుండె;
బలిసుమజలంబుల నెసంగె వనతలంబు!

సీత... ఆర్యపుత్ర! ఈపర్ణశాలయందలిపూలు జివుళ్లుఁ జూచినవెనుక నాకు మననగళ్లపై మక్కువ తగ్గినది.

రాము... దేవి! ఈవనము ర్జనము-అడవిగాలులొప్పఁగ సేవింతువుగాక.

సందియముమాని సడలింపు సుందరాంగి!
పాంసుభరితమ్ము నీయాకుపచ్చ రైక;
కరముఁ గెమ్మోవిఁ గ్రాఁగింప వెరవుగల్గు
మారుపులతెల్లి నగ్గులు దేరునఁటమ్మ.

[illegible]

# ద్వితీయాంకము

[లలిత సుకుమారవేష శూర్పణఖ ప్రవేశించును]

శూర్ప... (సనిర్వేదముగా) మరల నా రాముని పతిభావమునఁ దేర్తును. ఆతనిమాట నమ్మియే మూఢభావుని సరస్వతివలె లక్ష్మణుని సమీపించి యకృతార్థనై లేగి వచ్చితిని. కనికరము లేక దాక్షిణ్య మెఱుఁగక పురుషుఁడును గాక తిరుగు నామనుష్యజంతువునకై యుండక సీపర్ణశాలప్రక్కనే నిరీక్షించుచుంటిని. అయ్యో! మందభాగ్యురాలను- ఇది యొకశల్యము దెచ్చుకొంటినిగదా! అటుకాదు. నన్నుఁ బోఁద్రోచినవాని భాగ్యములే యింతటివి. అగుఁగాక. వీని యన్నగారికి సమస్తముఁ దెలియఁ బఱచి చూతును. (పరిక్రమించును.)

(సీతారాములు ప్రవేశింతురు.)

రాము... వైదేహీ! దూరమునకు సమస్తము నాశ్చర్యజనకముగా నే విన వచ్చును-

శైలాకారులు మేఘవర్ణు లగురక్షశ్శూరు లిందీయర
ణ్యాలం బొల్తురటంచుఁ బంచవటి యన్నం గౌతుకం బయ్యె మున్
లీలోద్యానములీల నియ్యడియు హాళిం గూర్చు సామాన్యమై
శైలాంభోధివనాళి శ్రోతలకె యాశ్చర్యంబు సంధించెడున్.

సీత... ఆర్యపుత్ర! అరణ్యంబుల నెసఁగు నాశ్చర్యంబుల నెల్లపుడు నంతఃపురంబులనె వసించు నెచ్చెలులకు మరల మరలఁ జెప్పుచు నాశ్చర్యము గల్గింపవలె నని నాకు ముచ్చట.

శూర్ప... (సమీపించి) ఆర్య! జయము జయము.

రాము... సుందరీ! లక్ష్మణునిఁ జూచితివా?

శూర్ప... చూచినాను.

రాము... అతఁడు నామాట వినియెనా ?

శూర్ప... వినుటమాత్రమే!

రాము... ఏమి చెప్పి యతఁడు నిన్నుఁ దిరస్కరించెను ?

శూర్ప... 'తపస్విధర్మమున నార్యు నుపచరించునాకు సమాధిభంగహేతుభూతవగునీతో నే' మని.

రాము... (సస్మితముగ) ఆతఁడాడఁదగినమాటయే యిది- కల్యాణీ! మరల నిన్నుఁ బరిశ్రమమార్గమున నియోగించుచున్నాను.

శూర్ప... వలదు వలదు. తమ రిట్లుపలుకవలదు. ఇక్కడనేయుండి యార్యునిపాదము లుపచరింతును.

సీత... పాప మీయామె యార్యపుత్రునిదెస నెనలారుస్నేహమునఁ దనగుణపక్షపాతమును బ్రకటించుచున్నది.

రాము... కల్యాణీ! నీయీకోరిక నేనును గోరఁదగినదే. ఇంకేమన-

సమిధలచే సమేధితుఁ గృశానుని నిల్పి గురూక్తిమై వసి
ష్ఠమునియె యేమెహాస్తమునిడం గయికొంటినో ధర్మసిద్ధి కా
ప్రిమదయె బ్రహ్మనిష్ఠకును బంధము; కాననె యీప్రయత్నమో
కమలదళాక్షి ! కోరెదవుగా కొరుఁ గోరగనైన పూరుషున్.

శూర్ప... అయిన నే నింకొకయెడకుఁ బోనోపను; ఇచ్చటనేయుండి జీవితము పరిత్యజింతును.

సీత... ఆర్యపుత్ర! ఈమెపూనిక కన్నడసేయవలదు.

రాము... కల్యాణీ! మరలను లక్ష్మణాభిగమనార్థమే నిన్నుఁ బ్రార్థింతును.

శూర్ప... పాపము శాంతించుఁగాక. ఆర్యునిమాట నమ్మి నేను స్త్రీసముదాచారము నతిక్రమించితిని.

రాము... అటుకాదు కల్యాణీ! ఇది సనాతనధర్మమే.

అభిసరణ మంగనల కయోగ్య మ్మటంచు
మది వితర్కింపఁబోకు మోమంజులాంగి!

వ్యోమకేశోద్భటజూటా ముక్తాహార మాల
జాహ్నవి తనంతఁ బొందదే జలధిపతిని ?

శూర్ప... మీకు వశనైతిని. మీయాన యేది కాఁజేర్పకుండఁగలను !
(తనలో) ఆతఁ డిప్పుడును నాదెసఁ దిరస్కారకఠోరుఁడగునా,
వెనువెంటనే నేను నాసహజప్రకృతిని ధరింతును.

(నిష్క్రమించును.)

సీత... ఆర్యపుత్ర ! దీను రాలీ బాలిక ! మీరు తిరస్కరించుటచేఁ బాప
మగ్గలముగు విరహబాధకుఁ బాల్పడును.

రాము... దేవి ! గృహస్థులకు స్వైరిణులతో డిసంసర్గము తగదు.

సీత... ఈమె నమ్మఁదగనిదేయైనఁ గుమారునియొద్ద కేలపంపవలయు ?

రామ... ఆమెతోఁ గుమారునకు సంబంధమేల ? ఆమెను దిరస్కరింప
మిష యిది.

సీత... అయ్యో ! కుమారుఁడు తిరస్కరించినవెన్క నీమెగతి యేమి ?

(సీతను నిరీక్షించి)

రాము... దేవి ! అంతయు నట్లుండనీ-

పదములే పల్లకులు; నీళ్లె వంటకములుఁ;
నేలయే సజ్జ; స్నానమే నిండుతొడవు;
అయిననీకాంతి నాచూడ్కు లపహరించు
నబ్బుర మయోధ్య నున్నట్లె యుజ్జ్వవదన !

సీత...(తనలో) ఏమి ! ఆర్యపుత్రుఁ డెఱుఁగఁడా. నన్ను వీడ్కొను నెడ
మహర్షి పత్నియనసూయ నాకు వర మిచ్చుట-భర్త కట్టెదుట
సమస్తము నలంకారమే యగునని.

(నేపథ్యమున)

నిలునిలు రాక్షసీ ! నిలు.

రాము... లక్ష్మణునిస్వరమువలె నున్నది !

సీత... అవును. వానిదే !

(బయటనుండి తీసికత్తితో లక్ష్మణుఁడును స్వస్వరూప
ధారిణి శూర్పణఖయుఁ బ్రవేశింతురు )

లక్ష్మ... నిలునిలు రాక్షసీ ! నిలు.

రాము... లక్ష్మణా ! ఇదియేమి ?

మొనగనంటకోఱలును మింటికి నిక్కెడునగ్రవెండ్రుకల్
కొండను మించుదేహమును గ్రొత్తమొగిళ్లను బోలుచాయ ! ఉ
ద్దండశరీరకాండన ల తాటకఁ గూల్చిననాఁడు లేదు నా
గుండియ దీనిఁజూచి తలఁకున్ వివశంబయి భీతిపెంపునన్.

సీత... ఆర్యపుత్ర! వారింపుఁడు వారింపుఁడు రాక్షసిని .

రాము... దేవీ! భయములేదు చూచియుండవా చిత్రభిత్తికలను పిశా
చికారూపముల మున్ను?

సీత... హృదయమా! ఏమిది? ఇడిగో ఆర్యపుత్రుఁడు. ఆర్యపుత్రునితో
నుండ నీ కీకంపమేల?

శూర్ప... ఎల్లపుడును దాపసమాంసమే తినుటచేఁ నరుచి గల్గి యుంకొ
న్ననా కదృష్టవశమున మోదకరూపు లీస్నిగ్ధసుకుమారులు
తమంతేఁ దాము లభించినారు. మేలు. వీరి నిర్వుర భక్షించి సీత
నార్యరావణునకు నజరు పెట్టుదును.

(ఎదురుగఁ బర్విడివచ్చును)

లక్ష్మ... ఇది యెదురుగఁ బర్విడివచ్చుచున్నదే.

కొంచక యావులించు నెడఁ గ్రొమ్మొగుళుల్ కరపీడ్రవయ్యె వ
ర్తించెడుచో ధరాతలము-క్రిందును మీఁదయి యల్లలాడు, ఆ
యంచును నోరు విప్పి భయదార్భటి మాదెస వచ్చు, దండముల్
డించి కవాటముల్ దెఱవ లీల నెసంగు పురీవరంబునన్!

రాము... ఇదిగో నిది-

నేలఁ దిరుగఁ బఱచు నిలుచు జృంభించు బి
ట్టఱుకు నుప్పరమున కొక్కసారి;
ఖడ్గసఖములైన ఖరనఖముఖములన్
విదిరించు జలదగణము చిద్రుపలుగను.

సీత... ఆర్యపుత్ర! వారింపుఁడు వారింపుఁడు రాక్షసిని.

రాము... దేవి! భయపడవలదు.

లోన శూన్యమాయంత్రమ్ముగాని యిద్ది
కాదు రాక్షసి వికచపంకజదళాక్షి!
వీఁక నాయమ్ము లిపు డింత సోఁకినంత
నార్చి వడి నేలఁ ద్రెళ్లి బిట్టంగలార్చి.

లక్ష్మ... ఆర్య! అనుగ్రహింపుఁడు. నేనే దీనిని ప్రతిబంధింతును.

(నడుమ నిల్చును)

శూర్ప... అయ్యో! ఎంత ప్రమాదము! నాకు భక్ష్యముగాఁ దగువాఁడు పరాక్రమించుచున్నాఁడే.

లక్ష్మ... నిన్నుఁ దుత్తునియ లొనర్చి పిట్టలకు వేయుదును.

శూర్ప... తొలుత నీ కఠోరహృదయు భక్షింతును.

లక్ష్మ... ప్రమాదపడితిని- ఇది నన్నుఁ బట్టుకొనినది.

రాము... నిలునిలు.

తాపసుల మేము గాము పాతకుల దెసను
విడుము సంరంభ మిదె యెత్తఁబడియె ధనువు;
రాక్షసుల దెసఁ గరుణాపరాఙ్ముఖములు
మాశితశిలీముఖంబులు మాయలాఁడి!

(శూర్పణఖ లక్ష్మణుని గ్రహించి మింటికెగసి నిష్క్రమించును.)

రాము...(సశోకముగా) దేవి! ఇంకను స్త్రీస్వభావము విడువవేమి!

రాజపుత్రోడవు ధైర్యమ్ము బిగియఁబట్టి
యేణలోచన! నన్నుఁ బో నిత్తుగాక
ఘనపథమ్మున కదిగో జివ్వనను జనియె
రాక్షసియు లక్ష్మణుని భుజాగ్రమునఁ బొదివి.

సీత...ఆర్యపుత్ర! ఇ న్నెవరు రక్షింతురు?

రాము...కుమారుని రక్షించువా రెవరు?

సీత...అతని చేత నాయుధమున్నది.

రాము...(విషాదముతో) రాక్షసి చేతులతోఁ బట్టుకొనియుండ నాయుధ మేమి చేయును?

నేలవిడి యడుగైనఁ బోఁ జాలనట్టి
మానవుని జన్మకంటెను హీన మేది?
కనుల నేఁ గాంచుచుండ లక్ష్మణునిఁ బట్టి
రక్కసియు మాయ మయ్యెఁ జా నక్కజముగ.

సీత...(సవిషాదముగ) పాపాత్మురాలను. ఆర్యపుత్రుని నే నడ్డువెట్టుటచేఁ గుమారునివృత్తాంతము హృదయశల్య మైనది.

రాము...(బాణముదీసి) ఇపుడు దీనిపై నేదివ్యాస్త్రము విడుతును?

(నేపథ్యమున)

పడితిఁ బడితి. ఆర్యా! శరణు శరణు.

రాము...స్త్రీస్వరమువలె నున్నది. ఏమీ భూకంపము! నిజము. లక్ష్మణుఁడు రాక్షసిని ద్రోసియుండును.

సీత...నాకు నట్లే తోఁచుచున్నది.

రాము...కల్యాణీ! చేయిపట్టుకొని నావెనువెంట రమ్ము. నేను లక్ష్మణు నన్వేషింతును.

(ఇద్దరును బరిక్రమింతురు.)

రాము... అహో !

అవనిధరధాతుసాంద్రమైనట్టిజలము
కాననం బెల్ల బల్విడిఁ గ్రమ్మునో కో ?
ప్రళయధారాధరోదరప్రతతి యిపుడు
తరుణరుచికమ్ము రక్తమ్ము కురియునో కో ?

(లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ... (సాన్నుక్రోశముగా) ఎంతటిపాప మొనర్చితిని ! ఆఁడుదియను మిషగలదానిదెస నస్త్రము ప్రయోగించితిఁగదా ! ఒక్కెడ నిది విచారమునకుఁ దావు కా దేమో !

అరసి కన్నులార నామెదౌరాత్మ్యమ్ము
నన్నగారినిశ్చయమ్ము నెఱిఁగి
యస్త్ర మెట్లొ న్యస్త మయ్యె నిశాటిక
గ్ణద్వయమ్మునందు నాసయందు.

ఆర్యా ! జయము జయము.

రాము... (సహర్షముగఁ గౌఁగిలించుకొని)

ఊఱడిల్లు మింక నోడెందమా నీవు
వత్స లక్ష్మణునకు భద్రమయ్యె;
నితనిచేత నేగదే యయోధ్యంబలె
వనమునందు సౌఖ్యపడుదు నేను.

(మరలఁ గౌఁగిలించుకొని) కుమారా ! ఏది యారక్కసి ?

(లక్ష్మణుఁడు తలవంచి నిల్చును)

(ఏడ్చుచు శూర్పణఖ ప్రవేశించును)

శూర్ప... అయ్యో ! అయ్యో ! అన్నా రావణా ! అన్నా కుంభకర్ణా ! అన్నా విభీషణా !రక్షింపుఁడు రక్షింపుఁడు. తబిసివేసములు వేసి కొన్న యీమనుష్యులపొగరునుండి నన్ను రక్షింపుఁడు:

రాము... లక్ష్మణ ! చూడు చూడు-

సురుచిరసాంధ్యరాగరుచిశోభితవారిదమాలయట్లు మే
దురతరసన్నిధాతురసధూసరపర్వతభిత్తికైవడిన్
దరుణరవిప్రభాపటలలక్షితమాలకవీధివోలె ని
ట్లరయగ నయ్యె నౌర తడియారని నెత్తుట నీమెమూర్తియున్ !

లక్ష్మ... అదృష్టవశమున నీనింద్యకర్మము నార్యుఁడు స్వయముగానే తెలిసికొనఁగలఁడు.

రాము... లక్ష్మణ ! తగినట్లు చేసితివి ! చంపుటకు మాఱుగ స్త్రీలకుఁ జేయవలసిన దండన మిదియే.

ఆమెయే యీమె - శూర్పణఖాభిధాన!
దండకారణ్యనివసనతత్పరాత్మ;
అరయ ఖరదూషణులకీమె యక్కగారు
ముద్దుచెలియలు మఱి పంక్తిముఖునకీమె !

ఈమెనుగూర్చి యింతకు మున్ను వింటిమిగదా !

శూర్ప... మఱవకుఁడు మఱవకుఁడు మనుష్యులారా మీయుద్రేకము. దానిఫల మిదిమొదలుగఁ జూతురుగాని.

లక్ష్మ... పొమ్మిక్కడనుండి.

శూర్ప... ఖరదూషణులకు నాయవస్థ చూపింతును. (నిష్క్రమించును)

సీత... ఆర్యపుత్ర ! ఇప్పు డూపిరాడుచున్నది. కాని యిట్టిరాక్షసుల వలనఁ బ్రతిభయముగల్గు వనప్రదేశమున లావణ్యవతియు సుకుమారగాత్రియునగు నాసీమంతిని యెట్లు వర్తించుచున్నది!

(రాముఁడు లక్ష్మణునిఁ జూచును)

(లక్ష్మణుఁడు రామునికర్థమునఁ జెప్పును)

సీత... ఆర్యపుత్ర ! కుమారుఁ డేమిరహస్యము చెప్పుచున్నాఁడు?

రాము... దేవీ !

బెడఁగుపిసాళిమోవి జిగివెగ్గెడుమోము, నొయారపుంగనుల్
క్కడుబటువౌకుచంబుల మలంగిన కొను, జగాషిఝుంద్దు ల్గొ

క్కడుగునఁ జక్కనూఱడుగు లల్లన నొత్తడుబిత్తరమ్ము పై
ల్లడరుమృగాక్షి రాక్షసిగనై యడలించె విచిత్రమావిధీ!

సీత...కల్లకల్ల.

రాము...లక్ష్మణుఁడు చెప్పుచున్నాఁడు.

సీత...ఆమెయందు నాకు నమ్మిక యుండెను; మీరు వారించి మంచిప
నియే చేసినారు.

రాము...వత్స! మొదట నీ వామె నెట్లు తెలిసికొంటివి ?

లక్ష్మ...(సస్మితముగా) ఎల్లెడల దాక్షిణ్యమున మీరు దోషమును
జూడఁజాలరు. నిప్పు వేఁడిమి గప్పఁదరమా ?

రాము...నిజమే!

కనికరముచేత మెత్తనై తనరుజనము
పాపమతులకుఁ దా వశవర్తియగును;
ముళ్ళు లేనట్టి లతలెగా పెల్లగింత్రు
స్వార్థపరులైనజనులు కార్యములపట్ల.

స్త్రీసామాన్యగ భావించిన నామె తిరస్కరింపఁ దగినదికాదు.
నీవు చేసినపని దుష్కరమే!

(లక్ష్మణుఁ డధోముఖుఁడై నిల్చును.)

సీత...ఆర్యపుత్ర ! ఇప్పుడును రాక్షసి కనఁబడుచున్నట్లే యున్నది.

రాము...త్రిభువనవైరిరావణుఁడు. దీనికి నగ్రజుఁడేని యింక దు
ర్లభమగువిశ్రమంబు మదిరాక్షి ! ధ్రువంబుగ నాకువింటికిన్
విభవ మెలర్పఁగన్ దనుజవీరులతో రణ మావహిల్లినం
ద్రిభువనభూతి సర్వరజనీచరమృత్యువు దానఁ గల్గుతన్.

సీత...ఆర్యపుత్ర ! చూడుఁడు-భగవంతుఁడగుసూర్యుఁ డెఱ్ఱనిపాటైనకిర
ణములచే రాక్షసి నెత్తుటిబురదను జెట్లకొనలపై బూయుచున్న
ట్లున్నాఁడు!

రాము...సాయంసమయ మైనది. వత్స ! లక్ష్మణ !

చక్కఁడాఁపు కృపాణి వి ల్లెక్కుఁడింపు
మమలతోయావగాహపూతాంగకతతి
నాచరింతముగాక సాయంతనవిధి
పవను బంధించి మంత్రముల్ పఠనచేసి.

లక్ష్మ...చిత్తము. (అట్లుచేయుచు)

రాము...ఇదే-

హరిచరణోద్ధతిఁ గగనమంటి విఖండితదేహుఁడై వెసఁ
ధరణికిఁగూలునానముచిదైత్యుఁడు నెత్తురుటేఱులంబలెన్
సురుచిరబంధుజీవసుమశోభితరక్తమయూఖమాలలం
దరణి సమస్తదిఙ్ముఖవితానముఁ దా నరుణీకరించెడిన్.



## శూర్పణఖాంకము.

## విష్కంభకము.

---

(నడకచే నలఁగి బడలినఋషికుమారుఁడు ప్రవేశించును)

ఋషి ...సూర్యవంశము సుస్థిరంబుగ నిల్చుఁగాక! తద్వంశభూషణము
గురాముఁడేగదా ఖరదూషణ కర్ణధారయగుయాతుధాన కేతు
మతిని జనస్థానమునుండి యమస్థానమునకుఁ బంపెను! కనుక నే
యీవనభూములు నావంటివారికిని స్వైరసంచారయోగ్యము
లైనవి. రామాశ్రయమున రాక్షసజీవితముల రుచిమరగినమృత్యు
జిహ్వ యింకఁ దప్పక లంకను జవి చూడఁగలదు. (ఇంచు
క నడచి) ఎక్కడ తీర్థయాత్రాశ్రమము నపనయించుకొందును?
(పరిక్రమించి చూచి) ఈసమీపమున నాశ్రమ ముండవచ్చును.

పులినము లాకుపచ్చగను బొల్చెఁ గ్రిమాలినియుక్తదర్భలన్
బలుకును జిల్క మానులను పల్కుల నొప్పఁగ; మానిపుత్రు లం
జలులను నివ్వరుల్ గుడిపి సాఁకినబాలమృగాళి నారగా
పులుగని నమ్మి తల్లిపొదువుల్ విడి నన్ దరియంగ వచ్చెడున్.

ఇచ్చట స్వాధ్యాయము వినరాకున్నది! (నిదానించి) హోమ
ధూమమును గానరాదు! కానిమ్ము ప్రవేశించి తెలిసికొందును.

(ప్రవేశించి చూచి)

ఈయాశ్రమము కొలఁదికాలముక్రిందటనే పాడువడినట్లున్నది--

విడుచు హుతగంధమును దర్భ లడరు వేది;
విడదు బలిభూమిని బ్రియమ్ము భృంగచయము;
కొమలఁగట్టిన యీవల్కలముల చేత
నిగుడు గుబురులతొగను దా నిముడించు.

ఎవ రయ్యా యిక్కడ? నే నతిథిని.

(నేపథ్యమున)

ఇటుఇటు. అతిథికి స్వాగతము!

(ప్రయాణసంసిద్ధుఁడై యున్న వృద్ధతాపసుఁడు ప్రవేశించును)

వృద్ధ... ఇటుఇటు. అతిథికి స్వాగతము!

ఋషి... తపోధనా! అతివిశాలమగుని యాశ్రమమున మీ రొక్కరే కన్పడుచున్నారు?

వృద్ధ... ఇది రావణబంధుఁడగు మారీచుని యాశ్రమము.

ఋషి... రామబాణము లెంగిలి చేసి విడిచినవాఁడని వింటిని. వాఁడేనా?

వృద్ధ... మఱేమి! కలదు రావణసోదరి శూర్పణఖ యనునది.

ఋషి... అవును. తపోవనమున లక్ష్మణుని ముఖముననే వింటిని—శూర్పణఖావిరూపకరణమును ఖరదూషణవధయు. మారీచవృత్తాంతమే నేను వినలేదు.

వృద్ధ... తరువాత రావణుఁడు సక్రోధుఁడై మారీచాశ్రమమునకు వచ్చెను.

ఋషి... అలాగా?

వృద్ధ... వచ్చి 'నీవు మృగరూపమున రాముని లోభపెట్టి దవ్వుగఁ గొనిపొమ్ము. నేను సీతను జేకొందును' అని వాఁడు మారీచుని ననేకవిధముల నిర్బంధించెను.

ఋషి... అఁ?

వృద్ధ... అప్పుడా మారీచుఁడు రాముని గౌరవము ననేకవిధముల నుగ్గడించి క్షణ మూరకుండెను.

ఋషి... యోగ్యముగానే యున్నది.

వృద్ధ... అంత రావణుఁడు సక్రోధుఁడై

తమిఁ బెజౌదంతి దంతకోశములతోడ
సమత విమర్శించు మనంచునఁ జాయనించు
చంద్రహాసమ్ము నొఱనుండి సంగ్రహించె
నట్టహాసమ్ముతో బొమ లట్టె ముడిచి.

ఋషి ... అం దాశ్చర్య మేమి?

వృద్ధ ... అపుడు ప్రాణభయమువలననో పూర్వవైరమును దలంచుకొని యో యశోదురావణునకు విధేయుం డయ్యెను.

ఋషి ... పుట్టువునకుం దగియే యున్నది వాని చేత.

క్రూరుల స్వభావమేదో
కారణమున మొటమొదటం గప్పంబడియుం బొ
ల్చారును బీజంబుల సం
స్కారమును కైవడి ఫలానుషక్తిన్ స్ఫుటమై.

వృద్ధ ... కావున రావణదూషితనుగునిందుండి యుద్విగ్నులై సంయము లెల్లరును వెళ్ళిరి. నాగమనత్వరయు మీరు చూచుచున్నారు గదా!

ఋషి ... అయిన మీరును దయసేయుండు. నే నింకొకయెడకుం బోయెదను.

(నిష్క్రమింతురు)



# —తృతీయాంకము—

(సీతారాములు ప్రవేశింతురు)

(నిమిత్తమును సూచించి)

రాము... దేవీ!

భరతుఁడు బాలుఁడంచు రిపువర్గము ముట్టెనొ కోసలంబులన్?
జిరవిరహంబునన్ జికిని జేరెరొ తల్లులు మువ్వు రోపమిన్?
ఖరవధ నన్యరాక్షసులు కల్పనసేయుదు రొక్కొ మాయలన్?
గరముస్ఫురించు వామనయనా యిదె వామభుజంబు మాటికిన్!

సీత... ఆర్యపుత్ర! తపమే యమంగళమునకు శాంతి యగును.

(మారీచుఁడు ప్రవేశించును)

మారీ... (సచింతముగా)

బాంధవులమీఁదఁ దగుస్నేహభావ మేమొ!
పాపపుంబుట్టు వడరించుప్రభుత యేమొ!
చేపడిన మంచినడవడి చేయిజార్చి
పూని నన్బంచె నిటువంటి కానిపనికి.

దీనికి వంత యేల?

రాఘవుండను పేరి పరాత్పరునకు
నెమ్మి నీశరీరము శరవ్య మ్మొనర్చి
యేనె యమలోకమందుఁ గాలూని మొదట
నీనిఖిలరాక్షసశ్రేణి కెదురుచూతు.

ఎక్కడ గదా రామాశ్రమము? సపత్నీకుఁడగు రాముని విచిత్ర మృగరూపమున నెక్కడ లోభ పెట్టుదును?

(నిష్క్రమించును)

(తరువాతఁ గవచధరుఁడు లక్ష్మణుఁడు ప్రవేశించును)

లక్ష్మ... "ఖరదూషణవధచే జనస్థాన ముద్ధృతకంటకం బయ్యె; కావున మీరుయథాపూర్వముగ నాశ్రమపదముల సనాథీకరింపుఁడు" అని యార్యశాసనము విన్నవింప మునివృషభు లనుగ్రహమున నొసంగినకవచము నకాలమందునను ధరించుచున్నాను. మఱియు వా రార్యులకును నలంకరణీయముల ననుగ్రహించిరి.

మై ధరించి యరాతులమై స్పృశింప
వారిమూయవేసము బట్టబయలు సేయు
ననుపమాశ్చర్యభూతమై నట్టిమణియు
నంశుగూఢరత్నాంగుళీయము లభించె.

(సమీపించి)

ఆర్యా! జయము జయము!

రాము... లక్ష్మణుఁ డదృష్టవశమున ననుగ్రహింపఁ బడినాఁడు. లక్ష్మణా! పూజ్యుల దర్శించితివా?

లక్ష్మ... దర్శించితిని-ప్రత్యేకముగ సమూహముగఁగూడ.

రాము... (ఆసనమునుండి లేచి) పరాపరవిదు లే మాజ్ఞాపించు చున్నారు?

లక్ష్మ... ఆర్యా! వినుఁడు-

"దేవవిరోధిరక్తకణదీప్తము సాంధ్యఘనాభమైన గో
దావరివారిపూరము వ్రతపరితిపాలన కక్షమం బగుణ;
పావనియా వసుంధరయుఁ బర్వతసన్నిభతత్కళేవర
ప్రావృతభాగయాట నెసలారెడు దంతురయాచు నెల్లెడణ.
కావునఁ గొన్నిదినము లిచ్చటనే యుండి మేము భద్రముఖు నాశీర్వాదముల వర్ధిల్లఁ జేయుదుము" అని.

రాము... వారు నిర్బంధమునకుఁ దగనివారు. (కూర్చుండును)

లక్ష్మ... ఆర్యుఁడు కటాక్షించుఁగాక!

(ఆశ్చర్యచూడామణియు నద్భుతాంగుళీయకముఁ జూపుచున్నాఁడు)

(సీతారాము లత్యంతము నాశ్చర్యమగ్ను లగుదురు)

రాము... ఆపూజ్యులు ఏనిఫల మేమని చెప్పిరి?

లక్ష్మ... " అంశుకేసరితములు హేమాంచితములు

పైనె మెసంగుమణియు నంగుళీయకమ్ము

నెవరు ధరియింత్రు నాగు స్పృశింతురేని

దొంటిరూ పొందుదురు మాయతొలంగ రిపులు" అని.

ఆర్యులు గ్రహింతురుగాక. మహర్షి శాసన మ్ముపేక్షింపఁదగనిది.

(తిరిగి యందిచ్చును)

రాము... లక్ష్మణా! అసాధారణ సుఖార్థియగు నావర్గము కవచఫలమే మని యుగ్గడించెను ?

లక్ష్మ... బాణములనుండి మర్మముల రక్షించునని.

రాము... అయిననిమ్ము. సిద్ధార్థులప్రీతిలతాకుసుమమును బ్రతిగ్రహింతును.

(కొని చూడామణిని సీతకబరీభరమ్మున ముడిచి యంగుళీయము తన వ్రేల ధరించును)

(సంభ్రమముతోఁ జూచి)

సీత... ఆర్యపుత్ర ! ఏమిది ? ఇంకొకయాశ్చర్యము !

రాము... లక్ష్మణ ! చూడు చూడు వనాంతర మెట్లు రూపపరివర్తన మందినదో!

లక్ష్మ... ఏమొకో యిది! అరుదెంచె నెందునుండి !

దేనిచే నీవనం బిట్లు దీప్త మయ్యె !

క్రొమ్మొగుల్లేని మెఱుపులు గ్రమ్ముకొన్న -

భాతి భాసిలుచున్నవీపాదపములు !

(నేపథ్యమున మర్మరశబ్దము)

(అందఱు ససంభ్రమముగఁ జూతురు)

రాము... జలదపథమ్ము నందు గతిసంభ్రమతన్ నెగయంగ దీధితుల్
చెలువగు నింద్రచాపముచు జిత్రవిచిత్రముగా రచించుచున్
వెలయఁగ రత్నకంధరము వెండిపదంబులుఁ బైఁడిమేను ద
ప్పల నదె చౌకళించెడు నపూర్వమృగంబు మృగాక్షి చూడుమా

సీత... ఆర్యపుత్ర! వనవివాస మద్భుతదర్శనములచే ననేకరసములు గలది!

రాము... దేవి! దీనియందు మక్కువ గలదా?

సీత... తమయుద్యానమున నీమృగ మెసలాడువారి కితరసంపద లేల?

రాము... నాకు నదే మనోరథము గల్గినది.

సీత... ఈమృగ మార్యపుత్రుని చేతికి దొరకునా?

రాము... ఒక్కెడ సజీవముగఁ బట్టువడకున్న సాంగమగుదీని చర్మముచే నైన రత్నాతిశయభాజనుఁడ నగుదును.

లక్ష్మ... ఆర్య! ఇది రాక్షసమాయ కాదుగదా!

సీత... ఏమో?

రాము... అట్లయినను ఈవిషయమున యత్నము చేయవలసియే యున్నది.

ఇదియుఁ బరమార్థముగ నొకమృగమ యేనిఁ
దీని నీయెలనాగ మనోరథమ్ము;
కాక యిద్యాది మాయామృగమ్ము యేనిఁ
దప్పక పరీక్ష సేయంగఁదగును మనకు.

లక్ష్మ... ఆర్యుఁ డనుగ్రహించుఁగాక. (బయలుదేరును)

రాము... నిలువుము. నీవు దేవిని గాపాడుచుండవలెను.

అడవియడవి తిరిగి యతిదూరవర్తులౌ
ఘనులఁ గొలిచి యిపుడె క్రమ్మరిలిన
నీలలాటమందు నిబిడీకృతం బయ్యె
శ్రమసముద్భవాంబుజాలకంబు.

ఇదిదూరము పోకుండ ధనువు తెమ్ము.

లక్ష్మ... చిత్తము (ధనువుగొని వచ్చును)

(రాముడు దందుకొని నమస్కరించును)

లక్ష్మ... అయ్యో ! ఈపూనిక మేలునకుఁ గాదు. ఈమృగము-

మరతకభాసి కంధరను మాటికి మాటికిఁ ద్రిప్పి చూచుచున్

బరుగులువాఱు నాల్కకొనఁ బచ్చిక నంటియు నంటకుండఁగాఁ

దరువులఁ జుట్టి క్రేళ్లుఱుకుఁ జాఁబయిఁ గ్రిందు తుట్టంగలించుచున్

బరువత నార్యుఁడున్ ధనువు వంచిన నయ్యెడ బ్రుంగుఁ గ్రక్కునన్.

అయ్యో ! ఇఁక దృష్టి ప్రసరింపకున్నది.

సీత... ఆర్యపుత్రుఁడు చూపునకుఁ దప్పినాఁడు.

(రథారూఢుఁడై రావణుఁడు శూర్పణఖతోను

సూతునితోను బ్రవేశించును)

రావ... ఏ బ్రిదికియుండ నరుని చే నింతవడు నె

నాచెలియ లీమె దుఃఖ మణంగుగాక !

అతని గికురించి సీత నే నాచికొందు

రథము చోదింపుమీ సూత రయముగాను !

సూతు... ఆయుష్మంతు నాజ్ఞ. (రథము తోలును)

శూర్ప... ఆర్య ! వలదు వలదు సంరంభక్రమము. మహేంద్రవిక్రమ

ము మాట్టిఁ గలిపినమీకు మనుష్యుఁడొక్కలెక్కయా ? ఉద్వేగ

మున నామె ప్రాణము వాయకుండునట్లు నేను సీతను మీచేత

నుంతును. ఆమెయే వానిప్రాణములు.

సూతు... పాడుస్త్రీలు పాపకార్యములఁ బండితుల నతిశయింతురు.

రావ... (క్షణమాలోచించి) ఈమె బాగుగనే చెప్పినది. ఆసీతయు-

నరభసవృత్తి రాము ననిఁ జంపి బలాత్కృతిఁ గొందునేని దు

ర్భరమగుశోక భారమునఁ బ్రాణము లప్పుడ వాయ కుండునే !

మఱియును రాము నొక్కనుసిమానిసిఁ జంప స్పృశించు నోటు వా

త్కరములు దేవతావిజయగౌరవపూర్వహాముల్ కుఠారమున్ !

సూతు... ఆయుష్మంతుఁడా!

మేనులు వణంకఁ గన్పిట్టెవాన లవుర
గలఁక వాటిన డెందముల్ గలిగి యిటఁగొ-
రవిహయంబులఁ బోని నిరథహయంబు
లూరకయె తోలు పడుచున్న పుష్పకమున!

రావ... సూత! వెళ్ళుచున్నది రాము నాకుటీరటికిఁగాని శివుని కైలాసమునకుఁగాదు.

సూతు... ఆయుష్మంతుఁడా! ఇది నాపనికావున నపరాధముగ భావింపవలదు. మీ చిత్తము. ఇదే విడుచుచున్నాను (తనలో) తొలుత సదాచారమును దరువాతఁ బగ్గములను.

(చోదించును-అందఱు రథవేగము నిరూపింతురు)

ఆయుష్మంతుఁడు రథవేగము చిత్తగించుఁగాక-

జలదకదంబకంబు జలసంస్రవమై నిడుపై తనర్చె; శృం
ఖలములు నిట్ట నిల్చుటను ఘంటలు మూకముఖంబు లయ్యెఁ గ
ర్వలివడిఁ జామరంబు చెవిపజ్జ జపించెడు నిశ్చలంబుగన్
బొలుచుఁ దలంచినంతనె నిను న్వెస గమ్యము డాయుచున్నటుల్.

శూర్ప... సూతుఁడు చెప్పినది నిజమే. ఇదే రాముని తపోవనము!

రావ... నీ వ్యసనమూలమగు రాముని ప్రాణప్రియయెక్కడ?

శూర్ప... అదిగో అదిగో! (వ్రేలితోఁ జూపును)

(సీతను జూచి సవిస్మయముగా)

రావ... ఈమెయా త్రైలోక్యసుందరి సీత! చిత్రము చిత్రము!

కనుగొంటిం జెఱపట్టి యచ్చరలతోఁ గళ్యాణి నింద్రాణిఁ జ
క్కనిపూఁబోణులఁ దెచ్చినాఁడ దశదిక్పాలమ్మునుం గెల్చుచో
ఘనసంత్రాసవిలోలఁ గంటి గిరిజన్ గైలాస మూగించుచోఁ
గనలే దెయ్యెడ నిట్టియా పిబుడు నాకన్నుల్ బల్లాధన్యముల్!

(సంకల్ప పర్యాకులుఁడై)

సారసనేత్రమంజిమరసాయనపానమునన్ మనంబు ద
న్పారఁగ నాయభీరఁయనాబ్జపరంపర ధన్య మయ్యె; నిం
డారఁగనీమె పుష్పన్మృసులాంగము నెప్డు కవుంగిలించి నా
వీరకిణాంకితంబులగువింశతిబాహువులు తృప్తి నొందునో!

శూర్ప... నాకోర్కె ఫలించినది.

రావ... (లక్ష్మణుని జూచి) వీఁ డెవఁడు?

కవచితగాత్రుఁడు శరధికర్క శపృష్ఠు డధిజ్యకార్ముకుం డెవ
డొకొ వీఁడు సీతదరి నెక్కటిరై నిలుచుండె మిన్నకే?

(శూర్పణఖ చెప్పాట నటించును)

అన్న రవురా! అదర్చెను శరావళి తాటకమీఁద రాముఁడీ
యువ యసిదూసె నీపయి నో హో హో నరవీరులవిక్రమార్భటుల్!

(నేపథ్యమున- మర్మరశబ్దముతో)

ఓ హో హో! ఏమీ వేగము!

రావ... ఎవనిదీ స్వరము?

శూర్ప... అన్నా! ఆ రామునిదే.

రావ... (తిరిగి చూచి) ఇతఁడా తపస్వి రాముఁడు! (తెలివి తప్పును)

సూతు... (తనలో) నిజము మారీచునివాక్యము. రాముఁడనఁగా-

అతఁడు కాకుండుఁ బో ప్రఫుల్లాబ్జనేత్రుఁ
డతఁడు కాకుండుఁబో తుషారాంశుమౌళి;
యతఁ డయోధ్య నావిర్భావ మందినట్టి
యసురహరమహా నోకానోకయౌషధమ్ము.—

రావ... సూతుఁడా! భీతుఁడ వయినట్లు కన్పట్టుచున్నావు?

సూతు... ఆయుష్మంతుఁడా నిజముగ భీతుఁడనే యైతిని? ఇపుడు
మన మే మనుష్యులమును రాముఁడే రాక్షసుఁడు వోలె నున్నది.

శూర్ప... అన్నా! ఈమె యీయాకార మలంకారములచే నింకెంతగా
శోభించునో!

రావ... ఈమె కాభరణములతో నేమి?

సహజసౌందర్యసౌభాగ్యశాలియైన
సత్పదార్థమ్మునకును సంస్కారమేల?
చంద్రమఃకళ నెవ్వండు సానవట్టు?
కౌస్తుభము దేనిచేత నింకను వెలుంగు?

సూతు... ఆయుష్మంతుఁడా! ఒక్కమనవి—

రావ... నిర్భయముగఁ జెప్పుము.

సూతు... ఈయమచరిత్ర గంభీరమై యొసంగు;
వరపతివ్రతవోలెఁ జూపట్టు నీమె;

రావ... నీ కెట్లు తెలిసినది?

సూతు... సకలబాంధవలోకమ్ము సంత్యజించి
వనమునఁజెలంగు ధీరయై భర్త వెంట.

రావ... మందుఁడా! స్త్రీలడెంద మెందు సుఖమున్ననందే గందళించును.
ఆమందాకినిరత్నబద్ధతటమం దాసీనయై నాయొడిన్
హేమాంభోరుహగంధి దివ్యపవనం బింపార సేవించుచున్
భీముదాంకితమామహేంద్రపదవిన్ గ్రోగంట వీక్షించుచున్
దామరుండన సేవగించి యిదియే నాతోడఁ గ్రీడింపదే?
(నిమిత్తమును సూచించి)

సీత... కుమారా అమంగళమాసన్నమైనదని నాకుడికన్ను చెప్పుచున్నది.

లక్ష్మ... అమ్మా!

దాయ పాల్గొరఁ దగుపదార్థమ్ము కాని
యీవనాంతమ్మును సమాశ్రయించు మనకు
వనటయేఁటి కశోభనం బనఁగ నేమి?
లక్ష్మ లెట గల వట నె గలారు రిపులు.

సీత... కుమారా! నేను ఋషిపత్నులు చెప్ప వింటిని — మీచేఁ జంపఁ
బడినఖరదూషణులభ్రాత యిర్వదిభుజంబులవాఁడు సుప్రసిద్ధుఁ
డొకఁడు గలఁడని.

రావ... అదృష్టమే! ఈమె నన్నుఁ గూర్చి యింతకు మున్నే విన్నది!

లక్ష్మ... అమ్మా! ఇందువలన నుద్వేగము వలదు.

రావ... ఏమి చెప్పను!

లక్ష్మ... పౌరుషమునకు బాహువులు ప్రమాణము కాదు.

ఇట్టి రావణుఁ గూడ జయించె నెవ్వఁ
డతని నా కార్తవీర్యసహస్రబాహు
బాహానుసాధనసక్రియాయోగ్యమైన
పరశువున మాని గాకఁడే తరువుఁబోలె?

రావ... మనుష్యుఁడా! మఱవకుమా నీయీమాట.

(నేపథ్యమున — హా లక్ష్మణా!)

సీత... అమ్మో! ఆర్యపుత్రుని స్వరమే!

లక్ష్మ... అమ్మా! ఆర్యుఁడార్తస్వర మొనర్చునా?

సీత... నీ వేమని తర్కింతువు?

లక్ష్మ... మాయ యని.

రావ... అహహా! దిట్టరి గదా వీఁడు!

సీత... బాలుఁడా! ఆమాయనుండియైన రక్షింపవలదా?

లక్ష్మ... రక్షింపఁ బడదగినవాఁ డెట్లు రక్షింపఁ గలఁడు?

(నేపథ్యమున — ఏమి లక్ష్మణా! వినఁబడలేదా?)

సీత... విను లక్ష్మణా! ఏల త్వరపడవు! స్త్రీలలో లక్ష్మియే యనంతర
గాధిని, నేను గాను. ఒక్కవారినే—

లక్ష్మ...(చెవులు మూసికొని) పాపము శాంతించుఁగాక.

పరమగంభీరమతులందుఁ బ్రథమ వయ్యు
నన్ను నెగ్గాడెదవు దూర మెన్న కీవు
పైఁబడగనున్న దిపుడు విపత్తు నీకు
నాపదలయందుఁ దారుమా రగును బ్రకృతి.

రావ...వనవాసమున వసివాళ్ళు వాడియున్న యీమె కాపద కాదు-
సంపదయే చేకూర నున్నదని యెఱుఁగవా మూఢా!

(నేపథ్యమున)

హా! హతోస్మి.

సీత...మూర్ఖుఁడా! లక్ష్మణా! విను నేను నీయెదుటనే చచ్చెదను. తరు
వాత నిరాశుఁడవై యన్నగారిసన్నిధికి వెళ్ళఁగలవు.

లక్ష్మ...దొరయదు వివేక మడరదు దూరదృష్టి
లేదు దాక్షిణ్య మూర్జితం బాదుకొనదు
స్త్రీలపుట్టువు గర్హింతు నీ యటంచు
నదియె కతముగ నన్ను ఱవ్వాడి తీవు.

సీత...పోనీ. నీవు మంచివాఁడవు గారాదా?

లక్ష్మ...కామరూపులు నవవైరకలుషితులగు
నసురులకు విశ్రమస్థానమైన వనిని
గురువినుతిఁ ద్రోసి యవివేకగుణనిలోల
నెటులు నిన్నొంటివిడిచి నే నేఁగువాఁడ?

సీత...స్త్రీలను రక్షించునది శీలముగాని బాణము గాదు.

లక్ష్మ...దేవత లెఱుంగుదురు; దేవతలే సాక్షులు.

సీత...అగుఁగాక.

లక్ష్మ...(ప్రణమిల్లి) నమస్తుభ్యం (నిష్క్రమించును)

సీత...లక్ష్మణుఁ డార్యపుత్రుని గలిసికొనునా?

(నేపథ్యమున)

సీతా! నీవును నన్ను పేక్షింతువా?

సీత... అభాగ్యురాలను గదా నేను. ఆర్యపుత్రుని స్వరముచే నన్వేషింతును.

(బయలుదేరును)

శూర్ప... అన్నా! చూడుచూడు! నాథుఁడు లేనిరతనము స్వయముగ వచ్చుచున్నది.

రావ... ఇది యుపేక్షింపఁ దగినసమయము గాదు. నేను రామరూపమున నీమెకు నగముదారిలోనే నిలిపివేయుదును.

శూర్ప... అన్నగారివన్నుగడ బాగుగనే యున్నది. రాముఁడు తిరిగి వచ్చునుండఁగా నేనును సీతారూపమున విలంబింపఁ జేయుదును.

రావ... మంచిది.

(శూర్పణఖ నిష్క్రమించును)

సూతు... ఆయుష్మంతుఁడా! నే నిపుడు చేయవలసిన దేమే నున్నదా?

రావ... (చెప్పుట నటించును)

సూతు... చిత్తము (తనలో) ప్రభుభక్తి యెంత బలమైనది! నాచేతఁగూడ నీకార్యమును జేయించుచున్నది.

(రావణుఁడు రథము దిగి రామరూపమున సీతయెదుట నిల్చును)

సీత... ఆర్యపుత్రుఁడు! జయ జయ మార్యపుత్రునకు!

రావ... దేవి!

మాయ బలముగ నెసఁగు దైతేయవరుల
నాల్కపై నున్ననిన్ను నోసలిననయన!
యెటు లుపేక్షించె లక్ష్మణుం డెటులు నీవు
మృదులపదముల రాఁజాలి తింతదవ్వ?

సీత... అభాగ్యురాలను. కుమారుని మిక్కిలి నిందించితిని. అతఁ డేమనుకొనునో!

రావ... మాయామృగస్వరముచే నీవు వంచింపఁబడితివి.

సీత... ఆర్యపుత్ర! ఏది యామాయామృగము?

రావ... దారిలోఁ దప్పిపోయినది; మరలఁ దనకుఁ దానే వచ్చును.

(నేపథ్యమున)

ఇదే యిదే వచ్చుచున్నాను.

సీత...ఆర్యపుత్రుని స్వరమే యిది!

రావ...మునుపును ఇట్టిస్వరముచేతనే వంచింపఁబడితి వనితలంతును

సీత...అయ్యో! దానిచేఁ గుమారునిగూడ నిందించితిఁగదా!

(రావణుఁడు సూతుని జూచును; సూతుఁడు లక్ష్మణరూపమున రథము జంకులేక కొనివచ్చి రావణు సమీపించును.)

సూతు...ఆర్యుఁ డనుగ్రహించుఁగాక; ఆర్యుఁడు సపత్నీకుఁడై రథమధి రోహించుఁగాక.

రావ...లక్ష్మణా! ఏమిది?

సూతు...ఆర్యా! తపస్విజనము తపోదృష్టిని జూచి, 'భరతునకు శత్రుభయము సమీపించినది; వేగమే మీరు వెళ్లవలయును' అని తపస్సుచే రథము నిర్మించి నా కొసంగి వనాంతరముల నంతర్హిత మయ్యెను.

సీత...సరిపోయినది. పూర్వముగూడ సీతవిహ స్తమున నే యుంచలేదా యాశ్చర్యచూడామణియు నద్భుతాంగుళీయకమును?

రావ...దేవి! నీయభిప్రాయ మేమి?

సీత...నేనుమాత్రము కోరఁదగనిదా భరతుని వంత దీర్చుటయుఁ బెద్దలకు మ్రొక్కుటయు?

రావ...లక్ష్మణ! తొలుత దేవిని రథ మెక్కింపుము.

సూతు...చిత్తము. (రథము సిద్ధము చేయును.)

సీత...అదృష్టమే! రాక్షసవంచననుండి తప్పుకొని వెళ్ళుచున్నాము.

(సంతోషమున నెక్కును)

రావ...(తాను నెక్కి) దేవి ప్రసన్నురాలై యున్నది. లక్ష్మణా! వేగ గుఱ్ఱములఁ దోలుము.

సూతు...చిత్తము. (తోలును)

సీత...(హాహాకార మొనరించుచుఁ దనలో)

ఏను ససందిగ్ధముగ రాముఁ డనియె తలఁచు
నైన నీమె స్పృశింపఁ జేయూడ దయయొ!
అదియ యాదిమదర్శనంబగున యేని
కష్టమే యగు స్త్రీసమాగమము మిఫుల !

(రథము కను మొరగును)

(తరువాతసీతారూపధారిణియగుశూర్పణఖతో రాముఁడుప్రవేశించును)

రాము...దేవి! జాల్మ్రఁడగునా రాక్షసుఁడు నే బాణము వదలినంత నా రూపమును గ్రహించి పడెను. అందుచే వాని నుపేక్షించి నీ వృత్తాంతము దెలిసికొన వెనువెంటనే మరలి వచ్చితిని.

శూర్ప...[తనలో] సిదేవిత్వము నీకైనది (వెలికి) ఆర్యపుత్రా! ఊరక యు నేను మీకు క్లేశము కల్పించితిని.

రాము...నన్ను వంచింపనే వాఁ డట్టిరూపముఁ గొనెను.

[లోలో నవ్వుకొనుచుఁ దనలో]

శూర్ప...నిజము. నిన్ను వంచింపనే రూపాంతరముఁ గొనుట.

రాము...దేవి ! నీవు నీవుకా నట్లున్నావే ? నాయెదుట నీ కింతటి తొట్రుపా టేల?

శూర్ప...ఆర్యపుత్రా! నాయాత్రము మీరెఱుఁగరు.

[ఆకసమున రథ ము కనంబడును]

సీత...ఇన్నాళ్లకు నాప్రియసఖిని వనస్థలిని విడిచి వెళ్ల వలసెను.

రావ...దేవి ! చాలుచాలు నందనవనము నతిశయించు నగరోద్యాన లక్ష్మిని జూతువుగదా!

రాము...సీత! [ఆకసముగఁ జూచును]

శూర్ప...ఆర్యపుత్రుఁడు! [ఆకసమునఁ జూచును]

సీత...ఆర్యపుత్రుఁ డి ట్లనుచున్నాఁ డేమి?

శూర్ప...ఆర్యపుత్ర ! చూడుఁడు చూడుఁడు—మనప్రతికృత్తు లద్దము నందుఁబలె యాకసమున నెట్లు కనంబడుచున్నవో!

రాము...నిజమ్ము, సీత ఇకపుడిటనుండ నిట్లు నిలువదు. నిక్క మీమెయు మాయా సీత; మాయారాముని పార్శ్వమున నున్నది. వాఁ డెట్లు రాముఁడుగాఁడో యామెయు నట్లే సీత కాదు.

(ఇద్దరును ఎత్తినతలలు వంచి పరిక్రమింతురు)

సీత...అభాగ్యురాలను మీ రార్యపుత్రులగుదురో కారో తెలియఁజాల కున్నాను.

రావ...ముద్దరాలా! మునుల వంచింప నాయూపమున రాక్షసులు సంచరింతురు.

సీత...నిజమే ఆర్యపుత్రునకు స్త్రీ సంబంధ మెక్కడ ? ఆమె యెట్లు సీత గాదో యతఁడు నట్లే యార్యపుత్రుఁడు కాఁడు.

రావ...దేవి శొంగనుండి తేరికొన్నది. లక్ష్మణా! వేగముగా గుఱ్ఱములఁ దోలుము.

సూతు...ఆర్యుని యాజ్ఞ.

[రావణుఁడు సీతను గొని సూతునితో నిష్క్రమించును]

[విషాదము నిరూపించి తనలో]

శూర్ప...నేను పోవుట కుపాయ మేమిగదా?

రామ...దేవి!

వేల జపారుణాధరము నెండఁగఁ జేసెద వూర్పుగాడ్పు చే
నేల యుదస్రి మత్కుల సృజింతు కుచంబుల నస్రహార మి
క్లేల యెదో తలంచి తపియింతువు కాళ్లను జేతు లాడన
ట్లోలలితాంగి! నీధృతియు నొక్కట నావెనువెంట సాగనే!

శూర్ప...ఆర్యపుత్ర! నీవ్యసనమునకు నేను గారణ మైతిని.

రాము...ఆమాయామృగ మెవ్వరి లోఁ గొనదు ? దీనికి వంత యేల- ఏమి చెప్పుమా లక్ష్మణుఁ డింకను రాలేదు?

శూర్ప...నేను నదే యనుకొనుచున్నాను.

రాము...ఆరక్కసుని కపట వర్తనమునఁ గుమారుఁడు మోసపోయె నని తలఁతును. దేవి ! నేను లక్ష్మణుని వెదకుదును-నీవును నా వెంట రాఁగల్గుదువా?

శూర్ప...ఎట్లయిన వత్తురు. రాక్షసవంచనయన్న నాకుఁ జెప్పరాని భయము. (ఇర్వురుఁ బరిక్రమింతురు)

[నేపథ్యమున]

నిండెనే మోసి కైకేయి నీదుకోర్కె?
అమ్మ కౌసల్య! నీవిధానమ్ము చనెనె?
యెటులు సహియింతు వింక నీయేకసుతుఁడు
ప్రాణముం బాసె రాక్షసబాణమునను.

రాము—అయ్యో! అనుకొన్నట్టే యయినది.

[మరల నేపథ్యమున]

ధర్మముం దప్ప నెపుడు సత్యమె వచింతు
పంటవలంతికి నోములపంట నీవు
యెటుల సీతమ్మ నీవు గణింపఁ బడెదు
దిక్కు మొక్కను లేనట్టిస్త్రీలలోన?

రాము—ఆత్మపరిత్యాగము చేసికొనక ముందే యాతని సమీపింప వలయు. [పరిక్రమింతురు]

(తర్వాత బాణోద్ధరణ వ్యాపృతుఁడు లక్ష్మణుఁడును రామరూపప్రచ్ఛన్నుఁడు మారీచుఁడును ప్రవేశింతురు)

లక్ష్మ—[ఏడ్చుచు]ఆర్య! గురువిధేయ! నాజీవితము నీయధీనము-నేను నిన్ననుగమింతును.

రాము—[నవ్వుచు] లక్ష్మణ!
మాయ యిది యెల్ల దుఃఖమ్ము మాను మిప్పు
డరయుమీ నన్ను నేను నీయగ్రజుండ;

లక్ష్మ—[చూచి సక్రోధముగా] రాక్షసా!
చంపినాఁడవు నాయగ్రజన్ము నీవు
నన్నుఁ గడతేర్పఁగా వచ్చినాఁడ వేమి?
నిలునిలు మెక్కడకుఁ బోయెదవు? (కత్తిఁదీయును)

(రాముఁ డంగులీయకముఁ జూపును; లక్ష్మణుఁడు తలవాంచి నిల్చును)

రాము... లక్ష్మణా! అంగులీయకము ఫలముఁ జూడుము.

(మారీచుని బాధనుఁ జిమ్మును; వాఁడు స్వస్వరూపముఁ గొనును)

లక్ష్మ... ఆర్య! ఇదే ఇదే—

పద్మపాటలరుచి భవత్పాదనిహతిఁ
బైకి నెగయుచో సహజమౌ ప్రకృతి నంది
మేఘములఁగూడి జవమున మింటినుండి
పృథివిఁ గూలెను గొండలు పిండిగాఁగ.

శూర్ప... (సశోకముగ) అయ్యో! మనుష్యులే బలశాలులైరా? తాత మారీచుఁడు కడతేరెనా?

లక్ష్మ... ఇది చూచినంతనే యీయంగులీయకము రాక్షససంశయము గల్గునెడ రూపవ్యక్తికిఁ గారణ మగునని నమ్మిక గల్గినది.

శూర్ప... నేను బోవుటకు మార్గ మేమి? (విషాదము రూపించును)

రాము... దేవి! ఏమియింకను శోకము మానవు?

(కన్నులు తుడుచును; శూర్పణఖ స్వస్వరూప మొందును)

రాము... లక్ష్మణ! ఏమిది?

లక్ష్మ... ఆర్య! ఇదే ఇదే-

కన్నులు నల్లకల్వల జొకాటపురూపుపరిత్యజించి కై
కొన్నవి బండికండ్లొయను ఘోరతరాకృతి; యీమె దేహముఁగ
బన్నమునొంది ముక్కిడితనాన వెలార్చుచు దంతమూలముల్
చెన్నఱెఁ దమ్మిదూండ్లు పయిఁ జేరఁ గలంగిన యేటికైవడిన్.

నీవు తెచ్చిపెట్టినదఃఖమూ యిది! (కత్తి దూయును)

శూర్ప... హా చచ్చితి చచ్చితి. ఆర్యా! శరణు శరణు.

(రూపమును గుఱించికొని రాముని పాదములఁ బడును)

రాము... (లక్ష్మణుని వారించి) శూర్పణఖా! నీ కభయ మిచ్చితిని. యథార్థముఁ జెప్పుము.

(శూర్పణఖ చెప్పుట యభినయించును)

రాము... శూర్పణఖా ! నీవిప్పుడు యీ యాకృతిన నీ సోదరుని యొద్దకు నా సందేశము గొనిపొమ్ము.

శూర్ప... ఎంతటి దయాళుఁడవు! సెలవిమ్ము.

రాము... విను.

"నా కనుదోయి భ్రాంతిని గొనం గనుపించుచు మాయసీత నా యాకృతినూని లక్ష్మణుని యాకృతి నూనఁగఁ జేసి చెచ్చెరన్ దేఁకువఁ బాఱు నీవలన నిక్కము వంచితకాదు సీత; పైఁ బ్రాఁకముసుం గనాథలయి వంచిత లౌదురు నీకు శ్వశ్రులున్." అని

లక్ష్మ... శూర్పణఖా! నా యీమాటయుఁ జెప్పుము.

"బంధుగులనేసఁ గోరుట పాడి గాదు
శాత్రవుల నెట్టు లర్థింపఁ జనును నాకు?
బాంధవులతోడ రావణా భండనమున
మునికి నాకు ముహూర్తదర్శనము నిజము!

శూర్ప... నాయన్నగారికి భండన మన్నఁ బండుగ.

లక్ష్మ... ఛీ. పొమ్ము.

(శూర్పణఖ మింటి కెగసి నిష్క్రమించును)

రాము... లక్ష్మణా! మనము వంచింపఁ బడితిమి
కనకమృగంబ దేడ? మఱి కాంతల నేడ నటుంచుఁ జూడకే
సునిశితబుద్ధి రాముఁడును సుందరిపల్కు తలన్ ధరించెఁగా
యని కృతబుద్ధులెల్లఁ బరిహాస మొనర్తు; విచార మేటికిన్
బనుపడు నెట్లనర్థములు ప్రజ్ఞ యనర్గవిహారకాంచనోన్ ?
ఇపు డాలసింపక యత్నము సేయవలయు. ముందు పద.

(నిష్క్రమింతురు) —



# చతుర్థాంకము

(రథస్థుఁడై రావణుఁడు సీతతోను సారథితోను బ్రవేశించును.)

రావ... లక్ష్మణా ! అశ్వముల వేగఁ దోలుము.

భరతుఁడు వైళమే ధరణిభారము డించునుగాక; సమ్మద
స్ఫురితమనస్కులై మనలఁ జూచి రహింతురుగాక తల్లు; లీ
తరుణియుఁ బాప మిప్డయినఁ దాఁ దనపాపురిఁ జేరుటన్ నిశా
చరవరగోచరాద్రివనసంభవదుఃఖము నీఁగుఁ గావుతన్.

సీత... ఆర్యపుత్ర ! కాదుకాదు. తపోవనమే నామదికి నచ్చినది.

సూతు... (తనలో) శాంతము నుదారమునైన దీమెచేతము- ఈమెవంచ నకుఁ దగదు.

సీత... ఏమి చెప్పుమా ప్రియము వినుచున్నను హృదయము తపించు చున్నది!

(కామావేశము నభినయించి)

రావ... ఏవిధి నిమనుష్యస్త్రీయందు మన్మథవాంఛఁ దీర్చుకొందును ?

సూతు... ఓహో ! ఈ కాముకుని నిర్మర్యాద !

చలమతిఁ జూచెడిన్ నియమశాలి వధూమణి సాధ్విఁ; జెల్లుగాఁ
బులకలు గ్రమ్మ బాహుయుగముం బ్రసరించు ను గౌఁగిలింప;నూ
ర్పులు నిగుడించుఁ దీండ్రముగ మోవి వివర్ణత నొంద; మాటికిన్
బలికెడు నేదొ యేదియొ నపస్మర నేదియొ చేయు నూరకే!

సీత... (తనలో) ఏమిది ? ఆర్యపుత్రుఁ డాకారమున నిం కొకనివలెఁ గన్పట్టుచున్నాఁడు!

రావ... అగుఁగాక ! ఈమెతో స్పర్శసుఖ మనుభవింతును. ఓహో! అపరిచయ మెంత బలవత్తమమైనది !

స్వమదకల్మాషితశ్రోత్రిచామరాగ్రి
మగుడు హేంద్రుని దంతావళాననమున
విక్రమము మొక్కవోని నావీరభుజము
తపిసి యిల్లాలి స్పృశియింపఁ దలఁచు నహహా !

సీత... ఏమిచెపుమా ! రాక్షసదర్శనమునకంటె వేయింతలుగ నున్నది
నాసంతాపము !

రావ... స్నానవిధులను దశవుగా జడలు గట్టి
యడవిపూవుల తొడవుగా నతిశయిల్లి
పిరిదిలి రథవేగమున నిప్పు చెదరి క్రేలు
నీదువేఁలి దేవి ! బంధింప నిమ్ము.

సీత... (సలజ్జముగా) కుమారుఁడు డగ్గఱనే యున్నాఁడు.
(స్వహస్తమున రావణహస్తము నివారించును; అతఁడు స్వస్వ
రూపముఁ గొనును; సీత మూర్ఛిల్లుచు)

రావ... దేవి! భయమువలదు నేను రాముఁడనే-

సూత... ఆయుష్మంతుఁడా! ఇంక నేమి చెప్పి యేమిలాభము-
బాలశశాంకరూపపరిపంధిభయంకరదంష్ట్రమున్, మహా
శైలతటోన్నతంబు, జలసంభృత మేఘనిభంబు, సర్వది
గ్జాలవిలోకనీయము ఖకాఁడము పిశాగ్రమనోహరంబునై
క్రాలి త్రుటిన్ స్వభావమును గైకొనె మీవపు వోమహాప్రభూ!
(తన్నుఁజూచుకొని నివ్వెఱపడి)

రావ... ఏమి నే నిట్లయితిని! దేవి! భయము వలదు భయము వలదు.
బాలా! యేల ననున్ భయప్రదునిగా భావించి శోకింప? నీ
త్రైలోక్యంబున నీసురాసురులలో దర్పించి నన్నావఁ గై
కో లెవ్వాని కెవం డెదిర్చెను నరుణ్ క్రోధాంధదిగ్వారణ
స్థూలవ్యాయతదంతకోశకులిశాతుంద్రోరువక్షఃస్థలుఁడ?

సీత...(సగము తెలివితో)ఆర్యపుత్రా! రక్షింపుము రక్షింపుము!
(నిండు తెలివితో సూతుని గని)సౌమిత్రీ! రక్షింపుము రక్షింపుము!
సూతు...ఇంకేది మాత్ర మేల? నేనును నిజరూపము గైకొందును.

(స్వస్వరూపము గొనును)

సీత...అమ్మో! ఇతఁడును గుమారుఁడు కాఁడు!

(వావిడిచి యేడ్చుచు)

హా ఆర్యపుత్రా! హా కుమారా! రాక్షసునిహస్తము నుండి నన్ను రక్షింపుఁడు.

(నేపథ్యమున)

ఇదే వచ్చుచున్నాను-

సూతు...ఆయుష్మంతుఁడా! చూడుచూడు—

తుండం బంకుశసన్నిభంబు! కనకస్తూపంబు కంఠంబు! ప్రో
చ్చండం బక్షియుగం బహో యిదిగో క్రోధస్ఫూర్తి నిగృధ్ధము
ద్దండప్రక్రియ నడ్డు యానపథ ముత్పర్ణంబు నుచ్ఛాఖము
త్ఖండంబై గజిగాడ్పులన్ ధరాశిరుటాఖండంబు వైన్యేంటరాన్!

సీత...అయ్యో! నాకే దిగతి? ఎవరు శరణము!

(నేపథ్యమున)

శరణ మే నౌదు; దశరథసఖుఁడ- పేర
నేజటాయువ; నిలుపురా నీరథంబు!
నే సహించెద నజ్ఞులదోసమైన-
విడువు రావణ వేవేగ వీరసతిని.

రావ...(నవ్వి) సహించునా నేమి నాయపరాధము నీపక్షి! కొఱ
డాతోఁ గొట్టి రథమార్గమునుండి తొలఁగింపు మీాతీతుకను.
ఈగ్రిద్ధ నిజముగ నేనెవరో యెఱుంగదు.

[సీసకైవాన]

ఎఱుఁగుదు నెఱుఁగుదును

భవుని గిరిక్రిందఁబడి శృంగభంగ మొంది

కార్తవీర్యుని చెఱఁబడి గర్ది కలని

వాలివాలంబునం జుట్టఁబడిన నిన్నుఁ

దెలియుదును దైత్య! త్రైలోక్యవిలయకేతు !

రావ... హాహాహా ! ఈపిట్ట మిక్కిలి కూఁత పట్టినదే !

ఉండుము నీవు; సీతయు మదూర్జితకర్మముఁ జూచుఁగాక; నే

భండనభూమి ముమ్మరపుఁబాళి ఘటించెద మత్తరాసి నా

ఖండలుఁ బ్రదిఁబోలెఁ గడఁకన్ దివి నాడెదు నీపులుంగు ను

ద్దండత నేల రాల్చెదను దక్షపక్షవిఖండనంబునన్.

(ప్రవేశించి)

జటా... చూచెదను లే!

చెలరేఁగ రేయిఁ గార్చిచ్చు, సందీప్తిఁ

జెందు నంజనగిరి శృంగము ల్పోలెఁ

బ్రలయమేఘద్యుతిఁ బరగు నీకపిల

వర్ణ కేశంబులౌ పదిశిరంబులను

గాలగాల నెత్తురువాఁగులు వాఱుచుండఁ

గులిశము న్మించు ముక్కునఁ గ్రుచ్చి క్రుచ్చి

బలువేడ్క నీవీరపత్ని వీక్షింపఁ

బదిదిక్కులం బడి పడ ద్రువ్వవాఁడ!

సూతు... ఇదే యిదే యెగిరి వచ్చుచున్నాఁడు!

రావ... నిలువుము.

(ఇర్వురును యుద్ధము చేయుదురు)

రావ... ఈదెబ్బ కాచు కొనుము. (కొట్టును)

(సీతచూడఁ జాలక కన్నులు మూసికొని యేడ్చును)

సూతు... అయ్యో! గృధ్రరాజు పడిపోయినాఁడు!

క్షతజజన్మకణోత్కరోక్షితతనుండు
శ్రమనిరుద్ధవిభుగ్నదుర్బలగళుండు
దినవిరామపయోదసందీప్తుఁడగుచు
బడెఁ బత్రరథుం డభ్రపథమునుండి.

సీత... అయ్యో! దేవతలు నిష్కరుణులు! దౌర్భాగ్యురాలను నాకొఱ
కైయీపక్షిరాజు శోచనీయుఁడయ్యె-

రావ... సూతుఁడా! అశ్వముల వేగఁ దోలుము.

సూతు... ఆయుష్మంతుని యాజ్ఞ.

హితము ననుకూల మాత్మసంగతము సత్య
మాగమధురహాస్యయుతము శ్రవ్యమ్ము నైన
నావచస్సుల కితఁడు కర్ణముల నిడఁడు.
కాను మదియేల? సద్గ్రహణమేల?

(నిష్క్రమింతురు)



## ప్రవేశకము

(మందోదరియుఁ జేటియుఁ బ్రవేశింతురు)

మందో... ఏమి! ఇదియుఁ గానున్నదా?

చేటి... అమ్మగారిముఖ మనుతాపమును గ్రక్కుచున్నది.

మందో... ఓసీ! నీ వశోకవనమును జొచ్చి యుంటివా?

చేటి... అవు నమ్మా! అక్కడ దొరగారిచేఁ జెఱపట్టఁబడిన త్రిభిసి యిల్లా లున్నది!

మందో... ఆమెయే నావినాశమునకుఁ గారణముగాఁ గన్పట్టుచున్నది.

చేటి... అమ్మా! ఎప్పుడును లేనిపు బెంబేలుల నమ్మవు. ఆమె యెట్లు వచ్చెనో యట్లే పోవున - మ్మగారే యెల్లపుడును లంకాధీశ్వరి.

మందో... వెఱ్ఱిదానివలె నున్నావు ఇంతఁగాఁ గలిసి మెలసి యుండియు నాభావము నెఱుంగఁజాలవైతివి-నాకొక పీడకల వచ్చినది!

చేటి... శాంతించుఁగాక శాంతించుఁగాక. చెప్పు మమ్మా!

మందో... ఓసీ విను. కెరటము లన్నిదెసల వ్యాపింప జలజంతువులు తుళ్ళి తుళ్ళి మిట్టిపడుచుండ మరకతపర్వతముల సమూహము వలె నీలమై యొప్పారు సముద్రము కొన్నిగడ్డిపోచలు వచ్చిపడుటచే క్షణములో నెండిపోయినది.

చేటి... అమ్మయ్యో!

మందో... నేనును దలనిండ నిసుక పోసికొని-దూరదూరముగ నున్న పండ్లును భయము గొల్పు మొగమును అగ్నికణములు రాల్చు కన్నులును శూర్పకర్ణములును గపాలవర్ణమును గలయొకానొకయమంగళస్త్రీచే బిగ్గఁ గౌఁగిలింపఁ బడితిని.

చేటి... ఓయమ్మ!

మండో... ఆసీతయుఁ దెల్లనిపట్టుచీర కట్టుకొని, హృదయమునఁ జందనము పూసికొని, కొప్పున మల్లెపూవులు దుఱుముకొని భర్తకే లూఁతమోసఁగఁ బుష్పక మధిరోహించుచుండ నేఁజూచితిని. హఠాత్తుగఁ దెలివి వచ్చినది.

చేటి... అమ్మా! విచారింపవలదు. కలల కనేక కారణములు చెప్పుదురు వైద్యులు. కానున్నను- ముల్లోకములకు భయముగూర్చు మనకు భయ మనే నేమి?

(నేపథ్యమున)

ఘనములు నించుత సరసగంధదళం బగుపుష్పవృష్టి; స్వర్ధునిఘనవీచికావితతిఁ దూఁగి రహించుత స్వర్గవాయువుల్;
ఘనరవసంతముఖ్యఋతువుల్ మొగిఁ బెంచుత నందనప్రభన్;
దనపదముల్ నివృత్తిఁ హిమధాముఁడు దిగ్వలయమ్ముఁ జుట్టుత.

మండో... చాటింపువలె నున్నది! వెళ్ళి కన్గొనిరా!

(చేటి నిష్క్రమించును)

మండో... కన్గొనుట కే మున్నది! అనునుష్యకాంత మనస్సు లోఁగొన మహారాజుగారి ప్రియత్న మిది!

(చేటి ప్రవేశించి చెప్పుట నభినయించును)

మండో... నియామాయా సముమాత్రము మిగిలినది. ఇపుడు మహారాజుగారేమి చేయుచున్నారు?

చేటి... సీతను జూచుటకై ప్రభువు వారు ప్రదోష వేషమును ధరించుచున్నారు.

మండో... అయినరావే! మహారాజు గారికిఁ దెలియకుండ- అశోకవనముఁ బ్రవేశించి, తీవజొంపములమాటున డాగి, కామింపని సీతవిషయమున మహారాజుగారి కాముకవృత్తిని జూచి యుపహసింతము.

చేటి... చిత్తము.

(నిష్క్రమింతురు)

## —పంచమాంకము—

(కామయమూనావస్థఁ దగు రావణుఁడు సపరివారుఁడై ప్రవేశించును)

రావ...(స్పర్శము నిరూపించి) వర్షవర ! నేను గలకాలమ్ము క్రిందటనే
వెడల నడచితినే సూర్యుని- వాఁడు మరల లంకకేల వచ్చినాఁడు?
వెంటనే యమాత్యుని జిత్రయోధుని గొనిరమ్ము.

వర్ష...అయ్యో! ప్రభువుగారి మేర మీఱిన మదనోన్మాదము!

చే వాడుచువానిఁ గను లలరించువానిఁ
గడలి తరఁగలు పొంగించి కలఁచువాని
మంచుఁజేతుల రహి నప్పళించువాని
సీతఁ డెఱుఁగకయున్నాఁడు శీతకరుని!

రావ...ఏల విలంబింతువు?

వర్ష...చిత్తము (తనలో) ఇట్టిరోగములకు వైద్యులు కారు మంత్రులు.

(నిష్క్రమించును)

(నిరీక్షించి విచారించి)

రావ...వీఁడు సూర్యుఁడు కాఁడు- నేనభయ మొసఁగిన చంద్రుఁడు!

వేవెలుంగులు విలవిల వేఁచుచుండఁ
జంద్రుఁడో సూర్యుఁడో యెఱుంగఁ జాలట్టి
విరహులకుఁ జంద్రు నెఱుఁగ నిబ్బరపు గుఱుతు
లోని హరినీలశకలమ్ముఁబోని మచ్చ.

(ఆలోచించి) ఈదుఃఖము స్వయముగఁ దెచ్చికొన్నది.

ఎవఁడు నాయాజ్ఞలేక స్పృశింప వెఱచు
నంశుతతి నంబుజనుల దిగంతరమున
పట్టిశశి యేర్చు నన్నుఁ బ్రత్యక్షముగను
ఱల్లముగ్గొను దుర్బలుండు నవస్థబలిమి!

(అమాత్యుఁడు ప్రవేశించును)

**అమా...** (అంతటఁజూచి) ఓహో! ఇంతకాలమునకు రాక్షసలోకము చంద్రకాంతి ననుభవించుచున్నది!

అదిగో! భగవంతుఁ డుదయించె నమృతమూర్తి
స్మరునిసేనాధిపుండు షుమాకరశ్మి-
క్షీరపాథోధివిలయవీచికలంబోలె
జీవలోకమ్ము తన్మరీచికల మునుఁగ!

రావ... హిమకరా! హిమగర్భ! పుష్పేషువశుఁడ
నైన నాపయి నీరమ్ము లగ్గి గ్రిక్కు-
నీదియుం గాదు పుష్పేషునిదియుఁ గాదు
శర్వరీనాథ! యిది సీత శక్తి గాని!

**అమా...** కన్నడసేసి స్వామికొాఅగామి రఘూద్వహుచే నశింతునా ?
తిన్నగ శాగు సెప్పి కడతేనుమనా ఖలుఁడైనస్వామిచే?
బన్నము నాకు నెట్లయినఁ బాటిలు; రెంటను స్వామిచేతిచా
వెన్నఁగఁ గొంత మే లటగునేఁ గనకుంచుచుస్వామినాశమున్.
ప్రభువివృత్తాంతము కష్టముగా నున్నది. ఇతఁడు తోఁకచేఁ గట్ట
బడి రోకలిచే మొత్తఁబడుచున్నాఁడు ఇదుగో ప్రభువు!

నాడఁగమోవి యూర్పు చెదో భావనసేయుచు నావులించుచుణ్
వీడఁగ వానకారు జిగి వీడుచు నుండు ఘనంబుకైవడిన్
బాడబపీతవారినిధిపాటి నిగూఢతఁ గాముతప్తుఁడై
పోడిమి వీడి మేన క్షయమునుం గొను సన్నిపుదుర్గమంబుగన్!

జయము జయము మహాప్రభూ!

**రావ...** క్రొత్త విశేత లేమేఁ గలవా?

**అమా...** (తనలో) ప్రభువు ప్రసన్నుఁడై యున్నాఁడు (వెలికి) జనప్రవా దము కలదు-

**రావ...** వాలిని జంపి సుగ్రీవుని యొద్దనున్నాఁడు రాముఁ డని న్నేనా?

అమా... చిత్తము. విశేషముగలదు.

రావ... అది చెప్పు.

అమా... తదాజ్ఞచే సీతాన్వేషణార్థ మన్ని దిక్కులను వానరసైన్యము
సంచరించుచున్నదని.

రావ... ఏమేమీ! అన్ని దిక్కులను సీతాన్వేషణార్థము తదాజ్ఞచే
వానరసైన్యము సంచరించు చున్నదనియా?

అమితభయావహాహిభవనాంచితశైలము లాయుధాలుగా
సమరజయోద్భటాప్రతిభటాసురసైన్యము మోహరించినన్
సమరమునందు నిల్చి నెటు నందనవృక్షలతాప్రసూనప
త్రములవె నేల రాల్పగను దక్షము లైనప్లవంగయోధముల్?

అమా... వానరు లత్యంతమును బలసాహసుల దగినవారగుదురుగాక-
ఇంకేమన—

రావ... ఇంకేమి?

అమా... దాశరథి ధనుర్ధరులలో నజయ్యుడందురు.

రావ... ఆలాగ?

ఏనిసహాక్షమందున సురేశ్వరుడు న్నిలువంగ జాలడో
యేనిమహాభుజంబులు మహేశ్వరుశైలము నూపజాలెనో
యేనిపరాక్రమంబునకు నెల్లగ్రహాళి గృహాళి సేడునో
వానికి జయ్యుడౌనసుడు? పందవు సిగ్గున నవ్వ వచ్చెడున్.

అమా... రాముడు నరుడా మహాప్రభూ?

గురునియోగతి వనములం దిరుగు రాము
నరయ జెల్లునె కేవలనరుడు గాగ?
లోకసృష్టిస్థితిప్రళయైకహేతు
వతడు హరిదశ్వకులజుడో హరియొ కాడె?

రావ... ఏమేమి? కేశవుడే యనియా? అయినను భయస్థానమా వాడు?

అతనియగ్రజు దేవేంద్రు నడలగొట్టి
స్వర్గమును నాథటుల్ గొడుపడచు వేళ

నచ్చురలతోడ శచి యంగలార్చు వేళ
నీహారిమహాత్త్వ మెల్ల నే యేటఁ గలిసె?

అమా... దేవతల జయించిన దెవరు?

రావ... ఏమి? దేవతల జయించినవానినే యెఱుఁగవా?

అమా... ఎఱుఁగను.

రావ... నేను.

అమా... కల్లకల్ల.

యమకుబేరేంద్రముఖ్యులౌ నమృతభుజుల
నీవు యత్నమ్ము లేక జయించితేని
యెట్టులు నీధైర్యసారం బదెల్ల నేఁడు
పుష్పశరుపుష్పశరములఁ బూదిఁగలిసె?

రావ... పుష్పశరుఁడు నన్నుఁ బ్రహరించుచున్నాఁడని తర్కింతువా?

అమా... ప్రత్యక్షమే!

రావ... సత్యముగ నిది ప్రత్యక్షవిషయమే.

పురహరుకంటిమంటలను బొల్పఱి నాఁడె కథావశేషుఁడౌ
స్మరుఁడిపు డేవిధాన శరసంతతి నన్ బ్రహరించుఁ జెప్పుమా?
శరదమృతాంశుకాంతియు సుసంగతతారవము భూరిమనోజ్ఞమై
పరఁగెడుసీతమోము పలుభంగుల నన్వివశాత్ముఁ జేసెడిన్!

అమా... వేదవిద్యాధ్యయనలక్ష్మి వెలసినావు!

ఆస్వాయంభువునకును దాయాదుఁడీవు!
అన్యసతియందు నెకదొట్టు నాస్థచేతఁ
దోరముగ నేల యిట్లపదూరువడుదు?

రావ... ఇదియును నిందయా?

అమా... ఇంతకంటెను నింద గలదా మహారాజా ?

రావ... అట్లయిన—

కోరినను తప్పక నీయుపయోగము లొనర్చు
కర్తలేనట్టిపలుకుల ఖ్యాతి వడసి
యమునులను భర్త హరి కన్నమైనయింద్రుఁ
బిలువఁగా నేమిటి కహల్య పేరఁగలిపి?

అమా... నిందమాట యటుండ నిండు. స్వార్థసాధనమగుధర్మమును
మనము వెడల నడచినట్లే గదా?

రావ... నీతి దెలిసినవాఁడా? సాధ్యాపేక్షముగదా సాధనపరిగ్రహము!
కలుగునయేని స్వర్గపదకాంక్షయె నాకు సహాయం మయ్యెడిఁ
బలరిపువజ్రపాతము నహస్త మొనర్చెడు చంద్రహాసమే!
తలఁగు తలంపఁబోకు మిఁక ధర్మము; అయ్యది సాధనంబు దు
ర్బలులకు; మన్మబోఁటి బలవంతుల కంతయుఁ బధ్యమే సుమా!

అమా... ప్రభువుల శక్తి యట్టిదియే. శక్తిమంతులగు మీబోంట్లచే
సదాచారము పరిత్యక్త మగుచున్నది. అయినను రాజర్షివృత్త
పరాయణుఁడగు రామునిజెస సాధుత్వ మపేక్షణీయము.

రావ... ఏమేమీ రాముఁడు సాధువా?
తాటకఁ జేర్చెఁ గృతాంతునిశాంతము
ధర్మ్యాలధర్మముఁ ద్రుంచి వెసన్;
చాటునఁ బొంచి శరంబున వాలిని
జక్కడఁచెం గన్నుచో ననుజున్;
బోటరిపోల్కి ధనుస్సుఁ దపోధను
పోల్కి జటాభర మూనినయా
జూటరి సాధు వసాధులమేము! శి
శుల్ పరవిశ్వసనాత్ములహో!-

అమా... దేవా! నా కింతవఱకే యధికారము.

రావ... చెప్పు మేమిసీయధికారము?

అమా... త్రివర్గప్రాపణము.

రావ... ఏ మా త్రివర్గము?

అమా... ధర్మార్థకామములు.

రావ... ఒకటొకటిగాఁ జెప్పు.

అమా... ధర్మము

రావ... దండ్యదండనోద్దండుఁ గదండధరుని
దండితు నొనర్చినాఁడ నే దండనములఁ
త్రిదివసంపదయును నాయధీన మయ్యె
ధర్మమిఁకేమి త్రవ్వి నా తలకు నెత్తు?

అమా... అర్థము.

రావ... అర్థము సాధించు నదేమి?

అమా... కోశదండముల యభ్యున్నతి.

రావ... బైలకేలను దిగుగాడు పౌజు మాది;
మా ఖజానా కుబేరుండు మా గురుండు;
క్రాలు మాయర చేత జగాలు మూఁడు;
నర్థమిం కేల మాకు యదార్థముగను?

అమా... కామము.

రావ... మేము దానినే కోరుచున్నాము; దానిచేతనే మా కోర్కి. నిండఁదగినది.

అమా... అందునను మనస్సు హెచ్చుగనే పోవలసినది గదా?

రావ... అట్లే పోయినది.

అమా... అట్లయిన—

అన్యభుక్త విరక్త ధరానుషక్త
చాలు నీయింతికై యింత బాలి యేల?
అందమున నింద్రసుందరీబృంద మెల్ల
నజరునకుఁ గాదు సీజనానాకు నిజము!

రావ... తెలియనివాఁడా! ఈవిషయమున నితరుఁడు ప్రమాణముగాఁడు. మఱియు.

పరభక్తియుగుచు లక్ష్మియు;
వరరత్నంబును దాంప వసుధాకరమాఁ;
గరమును విరక్తియగు వా
క్రమునేయు; విడు నెవ్వఁ? డటులె ధర్మం బిదియున్.

అమా...(తనలో)ఇంక మీఁద నాయుధము లే గతి. ప్రభువులు ప్రజ్ఞా సాహచర్యము నతిక్రమించిరి.

రావ...సౌమ్యా రామువార్తల నెఱుంగ నింకను చారుల నియోగింపుము.

అమా...ప్రభువుల యాజ్ఞ.

అనివలన భీతిచేఁ గాని యరులమీఁది
ప్రీతిచేఁ గాని నీకు నప్రియము పలుకఁ
గంఠదేశంబునందున గత్తి నిడిన
నధిపునకు సజ్జనుండు పథ్యమె వచించు.

(నిష్క్రమించుచు)

రావ...వర్షవర! అశోకవనమునకు దారిఁ జూపుము.

వర్ష...చిత్తము.

(ఇర్వురు నుద్యానమునఁ బ్రవేశింతురు)

రావ...(అంతటఁ జూచి)అహో! చిత్తము పరిచితమయ్యెను బరవశ మగుచున్నదే! ఇక్కడనుండియు సీత రామతపోవనమునే చింతించుచున్నదా?

నాకవిభూషణంబు లివి నందనవృక్షము లింద్రుఁ డుండ మం
దాకినియొడ్డునుండి భుజదర్పమునం బెకలించి తెచ్చితిన్-
ఈకడ నంచజంట మొగి హేమసరోజమరంద మానుచుం
స్కోకిలముల్ చివుళ్లు నవకోరకముల్లోని చొక్కు నివ్వెఱన్!

వర్ష...తుమ్మెదపిండు సంపగివాసనంబోలె సీత రావణవిభవమును జూచుచున్నది.

(కామావేశము నిరూపించి)

రావ... లోకుల కెవండు గూర్చు నశోకచూత
మంజరీబాణమాత్ర నే భంజనంబు
నా యయుగ్మాంబకున కిప్పు డలరె దేవ
వృక్షమును బాణసంచయం బింక నేమి!
వర్షవర! సీత శింశుపావృక్షముక్రింద నున్నదా?

వర్ష... చిత్తము దేవర?

రావ... సీత...

నేఁగన నన్నవజ్ఞఁ గను; నే శ్రుతిపేయముగా వచించినన్
దాఁ గరపల్లవంబులను దార్చును వీనుల; నస్సుమూర్తినై
నేఁ గనుదోయి కట్టెదుట నిల్చినఁ దాఁ బలవించు రామునిన్ -
గాగు దినంబు లిట్లుగుఁగఁ జానప్రసాదనసాధనం బెదో!

(తరువాత శింశుపావృక్షముక్రింద సీతయు లతావలయములమాటున మండోదరియుఁ జేటియుఁ బ్రవేశింతురు)

సీత... ఓహో రాక్షసుల నిర్దాక్షిణ్యము!

మండో... ఓసీ! ఇదుగో మహారాజు గారు! ఇంతకాల మూహించుచున్న దిపుడు కనులారఁ జూడవచ్చును.

రావ... (సమీపించి) దేవీ!

సీత... ఈపాపాత్మునిఁ డింకేమి పల్కునో!

రావ... గాంగజలంబుల న్మునిఁగి కల్పకుజంబుల కాన్కలెల్లఁ జే
కొంగొని వెండికొండ విహారింపు; చరింపుము నందనానఁ; ద
న్వంగి! తపస్సుచేతను మరాపయ నీకును స్వర్గలక్ష్మి; దా
నిం గనలేదు తే న్ననుఁ జి నీదుసతీత్వమె యడ్డగోడయై.

సీత... నీస్వర్గము నీకైనను. ఆర్యపుత్రునితో నరకమునకైనఁ బోవుదును.

రావ... దేవీ! నీకొఱ కంతఃపురమెల్ల విడిచి వైతును.

మండో... మహారాజా! ఈమాట జ్ఞప్తి నుంచుకొనుము.

సీత... కాదు కాదు. కేవల మంతఃపురమే కాదు నాకొఱకు నీవు ప్రాణ-
 ములుకూడ విడిచివైతువు.

మండో... ఈనరకాంత యెంతకఠోరముగఁ బల్కుచున్నది!

రావ... నిజము నాప్రాణములఁ గాముఁడు హరించుచున్నాఁడు.

సీత... కాదు కాదు రాముఁడు - కామునికంటెను సురూపుఁడు.

(అట్టహాస మొనర్చి)

రావ... వనచరవృత్తి క్షత్రకులబంధువు యుద్ధమునందు వైచుత
 తృణమయశస్త్రమింతయు సహింపఁడు రావణుఁడంటియుస్తమే!
 ఘనగిరిపక్షఖండనసుకర్కశవజ్ర మురంబునందు జ
 వ్వన ననదండవోలె నలవోక ధరించు వలంతి యింతిరో!

మండో... ఇపుడు మహారాజేమి చేయుదురు? ఈమె దేనికిని మెత్తపడ
 కున్నదే!

రావ... దేవి! ఇదిగో అంజలి.

 ఖచరదైత్యాహిగంధర్వకన్యకాస
 నాధమగు నస్మదీయావరోధనమ్ము
 సర్వమును దాస్యకృత్యమ్ము సలుపు నీకు
 మించుఁబోణిరో! ననుఁ గటాక్షించెదేని.

మండో... నేను దాస్యమొనఁ జేయుదును ఇతరులవిషయము నేనెఱుంగను.

చేటి... అమ్మా! చూడుఁడు చూడుఁడు - అన్నియెడల నంజలిపుటమ్ములఁ
 గూర్చుటచే వికసించినపద్మములతో నిండిన సముద్రమువలెనున్నారు
 ప్రభువువారు.

మండో... అభిలాషభంగమున నిప్పటి తెయ్యదము మహారాజుగారు కుపి
 తులుగారు గదా!

వర్ధ... (తనలో) ఏమి యీదృశ్యము!

 కృశయము కరపాండుల శరీరరేఖయైన
 కృష్ణపక్షసుత యీమైతగుఁ జంద్రరేఖవోలె!

మోగిచి యిర్వది చేతులు ముకుళితాబ్జ
మైనపద్మాకరం బట్టు లలరు నితఁడు!

రావ... దేవి! ఇదే యనునయసర్వస్వ మగు నంజలి.

(సాష్టాంగముగఁ బ్రణమిల్లును)

(సీత పాదము దవ్వులకు లాగికొనును)

మండో... ఈమె ధీరురాలు! మహారాజుగారి శిరస్సును బురదనుబోలె వదలించుకొనుచున్నది! సత్యమే సీత భూసుతయు రాముఁడు పద్మనాభుఁడు ననుజనప్రవాదము.

వర్ష... రాజపుత్రి! మహారాజుగారి ప్రణిపాత మేల యుపేక్షింతువు? ఏరినిగూర్చి విప్రులు యజింతురో నమింతురో శివంబు గోరి య వ్వారలు రాజరాజయమవాసవముఖ్యులు ముఖ్యదేవతల్ కోరి స్వమూనము ల్విడిచి కొల్తురు చేతులు మోడ్చి యేని నా ధీరుఁడు నీకు మాటికి నతిం బొనరించు దశాననంబులన్.

సీత... ఇది ప్రణిపాతముగాదు. వినిపాతము.

వర్ష... ఈమెను దేర్చ సాధ్యముగాదు.

రావ... దేవి! నీపాదములు నాకు శరణము.

సీత... ఆర్యపుత్రుని పాదములు శరణు గొమ్ము.

రావ... (సరోషముగ వేగ లేచి) ఏమేమి!

అఖిలవర్ణాళినుండి మస్తాంశ మొంచి
భువిని మాన్యమ్ము నయించు భూమిపతుల
కెల్లరకు నాలు మొగిని నీతల్లి ధరణి;
నీకును బతివ్రతాశీల నియతి యేల?

ఎక్కడ చంద్రహాసము?

(అందఱు భయముఖినయింతురు)

సీత... ఇది మీలే ! ఆర్యపుత్రుని పాదములే నా ప్రాణములకు గతి.

మండో... అయ్యో! ఇంతకు వచ్చెనా ? ఈమె పతివ్రత. నా ప్రాణము లొడ్డియైన మహారాజుగారి యాగ్రహమునుండి రక్షింతును. —

(వేగవచ్చి వారినడుమ నిల్చి)

మహారాజా ! జయము జయము.

రావ... ఓహో! దేవిమయసుతమండోదరి! (అధోముఖుండై నిల్చును)

మండో... మహారాజ ! మీచంద్రహాసమున కీమె భర్త రాముఁడే తగఁడు- చెలువున్న యీమెయా ? మీ రుపేక్షించిన నీమె తనంతట తానే ప్రాణములు విడుచును.

వర్ష ... (తనలో)

రాజులు ధరిత్రిపోల సీరాజపత్ని !
పొలుచు మాప్రభు విత్తఁడు సముద్రునట్లు !
కడఁక నిలఁ బ్రోచు చెలియలికట్టపోల
మయమున నిల్చియున్న దీనుయకుమారి !

ఇదే సమయము (వెలికి) దేవా ! మీరు ఖడ్గము ధరింప నేల?

అమరులయవస్థఁ గని హరి యగ్గిఁ గురియు
తనసుదర్శనచక్రమ్ముఁ దాల్చినాఁడా ?
కాక మీదెస హరుఁడు తీక్ష్ణకగుణమ్ము
నమిత మొనరించినాఁడా పినాకధనువు ?

రావ... నిజము నిజము.

(నేపథ్యమున)

జయము స్వామీ; జయము మహారాజా! జయము భద్రముఖా! జయము లంకేశ్వరా! ఘటికాదికలు గడచినవి. స్నానవేళయతిక్రమించు చున్నది. మహారాజా! దయచేయుఁడు !

(శంఖకటహాధ్వనులు మ్రోగుచున్నవి)

రావ... ఇప్పుడు మీ రడ్డునిల్చితిరి. కానిండు ప్రభాతమునఁ జూతును.

[సపరివారముగ నిష్క్రమించును]

సీత... ఆర్యపుత్రుఁడుగా కింకొకరియాస లేనిదానను. రాక్షసుని చేతిచావిడి పాపభూయిష్ఠము. కావున నార్యపుత్రుని స్మరించుకొనుచు స్వయముగనె జీవితము పరిత్యజింతును. (చూచి) అదృష్టమే! రాక్షసస్త్రీలు నిద్రించిరి. కానిమ్ము. రాక్షసుని తల తాకుటచేఁ బాంసులమైన యీ పాదము ననంతరాయముగఁ బుష్కరిణిలోఁ గడిగికొని పరిశుద్ధనై దుఃఖవిముక్తి నందుదును.

[నిష్క్రమించును]



అ శో క వ ని కాం క ము.

# —షష్ఠాంకము—

[తర్వాత నంగుళీయకహస్తుఁడు హనుమంతుఁడు ప్రవేశించును]

హను... లవణాంభోనిధి యాప్తబాంధవు సముల్లంఘించి మైనాకు న
భ్రవితానంబు విడ న్నభశ్శిథిలచర్మంబట్లు నాథాక విం
తవర్జ మగ్గురు ఉంగరంబుఁగొని సీతాదేవికై ప్రేమ్మి రా
ఘవదేవుం డడరించుబాణ మటు లంకారాజ్యముం జేరితిన్.
దేవి శింశుపాశ్రితయై యున్నదని గృధ్రరాజు చెప్పెను; ఆయు
ద్యానమే ప్రదేశముననున్నదో ! (పరిక్రమించి చూచి)
ఓహో రాక్షసనగరిపరమశోభ ! సత్యమే యిది.—

బృందారకమందిరమున
నందంబుగఁ గంటి కేపదార్థము లెఱుఁగన్
వెందియ కసురుఁ డవియె
ల్లం దెచ్చి యమర్చెనంట లంకాపురిలో !

(స్పర్శను నిరూపించి) ఈయుద్యానమే కాఁ దగును- ఇదియే
యగును.

మదకలమిళిందఝుంకారమంగళుండు
దుమకుసుమభాసురపరాగధూర్వహుండు
సారసతరంగి సంగతుషారతనుఁడు
మగ్గుఁడె చెప్పుచున్నాఁడు మారుతుండు.

ఇదే యీయుద్యానముఁ బ్రవేశింతును.

[ప్రవేశించి యంతటఁ జూచి సవిస్మయముగ]

తలిరుల్ పట్టుపటంబులౌఁ బువులు ముత్యంబుల్ ప్రవాళంబులౌ
ఫలముల్ మొల్కలు పచ్చలౌ దళములున్ వైడూర్యముల్ మేటిశా

ఫలు సౌవర్ణము లేవియో యివి యెఱుంగ న్నే వనాటుండ! గా
వలె స్వర్గీయము, లేల యస్వభరసంవ్యగుంప నా కీకథల్ ?
ఇక్కడ దేవి శింశుపాశ్రితయై యున్నదని సంపాతి చెప్పినాడు.
ఆశింశుపావృక్ష మెక్కడ నున్నది చెపుమా ? (వెదకి) ఇదే
గదా శింశుప !

[సంతోషమున సమీపించి యంతటఁజూచి సవిషాదముగా]

ఇక్కడ దేవి లేదు (తెలివి తప్పి మరలఁ దెప్పిరిలి) రాక్షసుఁడు
చంపివేసెనా ? నా సముద్రలంఘనము వ్యర్థమైనదా ? సుగ్రీ
వుని మనోరథము గొడ్డుపోయినదా ? స్వామివా రిచ్చినయీ
యభిజ్ఞానాంగుళీయక మేమి చెప్పి క్రిమ్మఱ నీఁగలవాఁడను?
ఎట్లయ్యును దేవిలేక దేవర జీవింపరు. సుగ్రీవభరతలక్ష్మణులు
ను వారిదేవేరులును దేవరనే యనుసరింతురు. అప్రయోజకుఁ
డనై మరలఁ గనంబడిన నేనే యింతకును గారణ మగుదును.
స్వాముల యెదుటఁ గల్ల వలుకరాదు. కావున యథాశక్తిగఁ
బ్రయత్నించి పిదప యశోమూర్తి నగుటయే నిశ్చయము.

[నేపథ్యమున]

భగవంతుఁడా! మృగలాంఛనా! ఇదే నీకంజలి. కలకాలము
నకు నాకు నయనగోచరుఁడ వైతివి.

హను... ఏమిది ? విలాపమువలె నున్నది. ఈచెట్టుతొఱ్ఱలో డాఁగివృ
త్తాంతము బాగుగా నెఱుంగుదును. (అట్లొనర్చి) ఇదిగో దేవి !

ధరణిపైఁ బడి మాటికిఁ బొరలుచుంట
గువ్వకుత్తుకరంగు డక్కొనెడు ధూళి
యూఁక తెగి పొఱుకన్నీటివాఁకఁ బెరసి
పూజ్యురాలికి నయనమొ మైపూఁత యయ్యె !

ఈమె విలాపవచనము స్వామివారికి శ్రోత్రపాయనముగాన
క్షణమాత్రము నిల్చి కూడఁ గట్టుదును. (ఊరక నిల్చును)

(తర్వాత విలపించుచు సీత ప్రవేశించును)

సీత... చంద్రా! నిన్ను నే నిందింతును. నీకు క్షత్రబాంధవ్యము విన వచ్చుచున్నది. సమానుఁడ వని ని న్నార్యపుత్రునితోఁ గలిపి లోకము పలుకుచున్నది. కాదు కాదు. నే నున్మత్తురాలను. నీ వెక్కడ? ఆర్యపుత్రుఁడెక్కడ? నీవు రోజున కొక్కొక భార్యను జేకొని కౌఁగిలింతువు. ఆర్యపుత్రునకు మందభాగ్యనగు నాయందే మక్కువ. పోని. ఇది యిట్లుండనీ. నన్నిట్లొకతెను జూచుచున్నావు; ఆర్యపుత్రునొక్కని జూచుచున్నావు. ఒక్కింతయుఁ బలుకక యే తటస్థునివలెఁ జోవుచున్నావే!

హను... ఈమె విలాపాంతమునఁ గనంబడుదును.

సీత... సప్తర్షు లని విన వచ్చువారు వీరే! ఈయనయేగదా భగవంతుఁడు రఘుకులోపాధ్యాయుఁడగు వసిష్ఠుఁడు! ఈమెయే పతివ్రతలకు నిదర్శనభూతయగు భగవతి యరుంధతీదేవి! భగవతీ! ఏ మీవ్యవసాయము? రాక్షసగోచరమగు నీదేశమున నాకొక్క ప్రతీకారముచు జెప్పవైతివి! సర్వథా నీదర్శనఫలము నే నన్యథాకరింతును.

హను... దేవి! నే నాటంకపఱచుచున్నాను.

సీత... ఎందుండి యీయాక్రందనము! (ఇంకొకయెడఁ జూచి) ఇదే చక్రవాకవధువు రాత్రియును రాక్షసునిచే నెడసేయఁబడి నావలెనే వ్యర్థముగ నరణ్యరోదన మొనర్చుచున్నది.

హను... స్వామిని! ఇది యరణ్యరోదనముగాదు నీభర్త పూజ్యపాదుఁడగు శ్రీరాముఁడే యీమాటలువినుచున్నాఁడు.

సీత... నేను దేవతల నిందించుచున్నానే- వారి కేల నాపై నీయనుగ్రహము? కాకున్న నిది రాక్షసుని యింకొక మాయయా?

హను... స్వామిని! సంశయము వలదు. దూత నమ్మా నేను మనువంశప్రదీపుఁడగు నార్యశ్రీరామునకు.

సీత... మధురము నీవిన వచనము. రాక్షసజాతి కానే కాదు పుట్టనుండి

హార మెట్లు పుట్టును ?

హను... దేవి ! నీ కిదే యంజలి

సీత... నీరూపముఁ జూపుము- కోటరము వెల్వడి రమ్ము.

హను... దేవి యాజ్ఞ. (దిగి ప్రణామ మొనర్చును)

సీత... వానరుఁ డితఁడు. తలఁచు రాక్షసుఁ డీరూపము గ్రహింపఁడు.

[నమస్కార మొనర్చుచు]

హను... పావనులు రాజఋషులఁ బావనులఁ జేయు

జనకు జనకుని విభు రామచంద్రు నీవు;

ఆతుషారాచలుని సలిలాధినాథు

నఖిలజనవంద్యయైన జాహ్నవిపిధాన.

సీత... మధుర వాగ్బ్రహ్మ యగు నీతఁ డెవఁడు? ప్రశ్నింతును వీనిని.

తర్వాతఁ బరీక్షింపఁ బ్రయాణ మాశ్చర్యచూడామణి కలదు

గదా? సవిస్తరముగాఁ జెప్పుమా- ఎవఁడవు నీవు ? ఏయుపాయ

మున నార్యపుత్రునితో సంసర్గము గల్గినది?

హను... దేవి వినుఁగాక. నేను వాయుపుత్రుఁడను; సుగ్రీవుని యాజ్ఞా

కరుఁడన; పేరు హనుమంతుఁడు.

సీత... ఆలాగా?

హను... ఆసుగ్రీవున కగ్రజుఁడగు వాలితో స్త్రీనిమిత్తముగాను రాజ్య

నిమిత్తముగాను వైరము పెరిఁగినది. అంత నాసుగ్రీవుఁడు వాలి

భయంబునఁ జతురంతమగు పృథివి నెల్లఁ బ్రాదేశమాత్రముఁ

బలెనే పర్యటించెను.

సీత... పాపము!

హను... అంత సుగ్రీవుఁడు మునిశాపబలమ్మున వాలిభయ మ్మెఱుంగని

మాల్యవంతమను పర్వతమ్మున నుండెను,

సీత... పోనీ!

హను... అపు డాకాలమునందే సవంచనస్వభావుండును అల్పాయుష్కుం
డునునగు రాక్షసునిచే స్వాములు కష్టముగు నవస్థాంతరముఁ
బొందింపఁబడిరి.

సీత... అయ్యో!

హను... అమ్మా! ధీరుఁడైనను శ్రీరామచంద్రుఁడు కారణబలంబున
సముద్రమువలె నధీరత్వముఁ బొందెను.

సీత... మందభాగ్యను!

హను... పిదప మహాయువగుజటాయువు ప్రమాణమ్మున మిమ్ము నన్వే
షించుకొనుటకుఁ దమ్మునితోఁగూడ శైలమునుండి శైలమును
అరణ్యమునుండి యరణ్యమును మాటిమాటికిఁ బాదన్యాసము
లచేఁ బవిత్ర మొనర్చుచుండెను.

సీత... ఎంత కష్టము!

హను... తర్వాత వాలియనుచరజనముఁ బరీక్షింప సుగ్రీవాజ్ఞచే సంచ
రించు నేను ఒకానొకవనాంతరమున దేవరఁ జూచితిని.

సీత... నిజము! నీకన్నులతోనే?

హను... మఱేమమ్మా!

సీత... చెప్పుచెప్పు. ఆర్యపుత్రుఁ డెట్టివాఁడు?

హను... అవాఙ్మానసగోచరుని వర్ణింప నావశమా తల్లీ!

చరణంబు లున్నతోజ్జ్వలనఖంబులును
శంఖచక్రాంకభాస్వరతలమ్ములును!
స్థిరములు చిఱుతొడల్! చిన్ని నెన్నడుము
చెలువారు మణిశిలా శ్రీనుండలమ్ము!
ఉరము శ్రీవత్సాంక! మఱి బాహుయుగళి
యురగాయతమ్ము మహాద్దండబలము!
సరసిజరమ్యమ్ము చక్షుర్ద్వయమ్ము!
సంపూర్ణశశిసుప్రసన్నమ్ము ముఖము.

సీత... ఇపు డార్యపుత్రుఁడు కన్నులకుఁ గన్పట్టుచున్నాఁడు.

హను... అప్పుడు:-

సరసిజపత్రనేత్ర! చనఁజాలితి వెచ్చటి కంచు బిట్టు వం
దురుచును బాష్పబిందువుల నూపుర మంచితమౌక్తికచ్ఛవిన్
బరఁగఁగ డాసిహస్తమున మస్తమునన్ ధరియించి మాటికిన్
స్మరవశుఁడై వనిం దిరుగుస్వామిని గంటిని రామభద్రునిన్.

దేవి! ఇంతయేల? నీచరణాభరణము ప్రభువునకు సర్వాభరణ మయ్యెను.

సీత... నీ వె ట్లెఱింగితివి?

హను... కన్నదానికిఁ గనుట ప్రమాణము; కననిదానికి లక్షణముఁ ప్రమాణము.

సీత... తెలిసినది.

హను—అపు డమ్మా-

మరకతకాంతియుక్తములు మాద్యదళుల్ ధరణీజపంక్తు లాం
తరనిపతన్నదీసలిలధౌతగిరీంద్రనితంబభూములున్
సురుచిరపాంపవీచికలఁ జొక్కుచు శాంధులఁ దన్పు వాయువుల్
ధరణిపుఁ డేర్ప వయ్యె గుణధాము భవత్సుగుణైకకాముని న్.
తన ప్రియురాలి శైవలముదండకుఁ దార్చెడుచక్రవాకమున్
వనజమరందపానమున వావిరిఁ గేగెడుమత్తభృంగమున్
బనివడి తమ్మిదూండ్లరుచిపొండితి నొప్పెడురాజహంసమున్
జనని! సమాశ్రయించు రఘుచంద్రుఁడు నీదరి కంప దూతఁగన్.
కెరలియాడు నెమిళ్ల కేంకృతుల సలికి
మొగలిపూరేకులఁ గదల్చి పొదలు వలికిఁ
గారొప్పాయి ఘుప్పరమ్మునఁ గ్రమ్ము రేల
క్షణము రఘుపతిప్రాణసంశయము వొందు.

అప్పుడు మెఱుపు మెఱసినంత—

'మునిఁగె నాసీత మేనెల్ల మునిఁగె నీటఁ
జిగురుఁగేల్మాత్ర మల్లదే మిగిలెఁ బైట'
ననుచు నోదేవి! రఘుదేవుఁ డప్డె యుఱికి
పలుమఱుంగొనుఁ గేలఁ జెంగలువపూల.

తరువాత నింకొకయెడకుఁ బోయి-

లేఁజివుళ్ళ సందముగఁ గల్పించి సెజ్జ,
పూవొకటి కోసి నీకొప్పునను దుఱుమ
'రమ్మవైదేహి! నాజీవితమ్మ! విడుమ
కోప'మని వేడుకొను నొక్కకుసుమలతను.

సీత... మారుతీ! ఇట్టిది స్త్రీలకుఁ బ్రియముగదా నాకు దుఃఖమును సిగ్గును గల్గించుచున్నదే! చెప్పుచెప్పు అధన్యనగు నాకొఱ కిప్పటికిని నార్యపుత్త్రుఁ డట్లేయున్నాఁడా?

హను... లేదు లేదు. సహాయలాభమున స్వామివారిపుడు తేరినారు.

సీత... ఆర్యపుత్త్రునకుఁ గష్టమందలి యిష్టమిత్త్రుఁ డెవఁడు చెపుమా?

హను... తర్వాత వారి నావనమునుండి గొనివచ్చి సంస్కారము శరీర జీవాత్మలంబోలె నేను రామసుగ్రీవులఁ గలిపితిని.

సీత... మంచిపని చేసితివి.

హను... తరువాత శ్రీరాముల మహానుభావతచే వాలిభయ మత్యంతమును దూరీకృతముకాగా, సుగ్రీవుఁ డయత్నముగనే ఋక్షవానరైశ్వర్యమును నిఖిలదిఙ్మండలైశ్వర్యమునునగు నప్రతిహతశాసనముఁ బొందెను. సుగ్రీవుఁ డిట్లు కృతార్థుఁడై పిదప నిన్ను వెదకుపూనికఁ బ్రభుకార్యమున వ్యాపృతుఁ డయ్యెను.

సీత... ఇది నాయదృష్టము!

హను... జన్మచేఁ బరిహాసమాత్రమైనను గర్మచే దేవతల నతిశయించు వానరవీరులను ఋక్షాధిపతులను గడువుపెట్టి యాశాచతుష్టయమునకుఁ బుచ్చుచు నీదిక్కునకు యువరాజు నాయకు నొనర్చి మమ్ముఁ గొందఱఁ బంపెను.

సీత... ఈదిక్కే శంకింపఁ దగినది.

హను... తర్వాతఁ బ్రభువు శ్రీరామచంద్రుఁడు వానరవీరు లందఱు నుండఁగాఁ దొలుత గాంచినవిమ్మికపై నన్నుఁ జేరఁజీరియిది యొసంగెను.

(నమస్కరించి యంగుళీయక మిచ్చును)

(సంతోషముగఁ బుచ్చుకొని చూచి)

సీత... ఇది యచ్ఛుతాంగుళీయకము! తపోధను లిచ్చినది! కుమారుఁడు కొని తెచ్చినది!

(మనోవ్యాకులతదోఁప విలపించును)

హను... పాప మీయమ్మ-యీభద్రముద్రికను-

అలకలయం దమర్చుకొను నాననమందు గదించు మాటికిఁ
బులకితబాహువల్లరుల ముమ్మరమౌ తమిఁగౌఁగిలించు నం
గుళి నవపల్లవంబుల్లను గోరి ధరించును వేఱవేఱ ని
శ్చలమగుదృష్టి నట్టె కను సల్లలితంబుగ ధ్యానలీనయై.

సీత... ఇది లోకాభరణుని యాభరణము! ఇది బాణాసనపరిఖిన్నము! ఇది రాక్షసమాయాసూచకము! ఇది రాత్రుల రత్నదీపము! ఇది వదనాలంకారార్థముగఁ బరికల్పింపఁబడిన యాదర్శము!

హను... ఈమెకై ప్రభు వంతకు నూఱంత లున్మాద మొందవలసినదే!

సీత... అంగుళీయకమా! ఇపు డార్యపుత్రుని హస్తమునుండి నీవు నెడఁబాసితివి. నిన్ను నార్యపుత్రుఁడు పాణిగ్రహణ మొనర్చెను. నీ కెవ్వనిచే విపన్నత్వము గల్గినది. నీవును నావలెనే రాక్షస బందీభూత వైతివి?

హను... శ్రీరఘూద్వహు నిడువాలుఁ వ్రేలినిం దొ
లంగి విరహాగ్నిఁ గ్రాఁగు నీయుంగరమ్ము
భాసురచరిత్ర! యీనాల్గువాసరములు
విశ్రమము నొందు నీవేలి నాశ్రయించి.

సీత... ఇది కొంత యూఱటగదా!

హను... బలారె!

రెల్లువలె విరహాభరమున
వెల్లనయగు నంగకముల వెలయఁగఁ బులకల్
నల్లఁదన మొదవె నుంగర
మల్లన నంగుళిని దొడిగినంతనె సతికిన్!

సీత... ఈదివ్యనామాక్షరములనొ రారఁబల్కెదను.(చేయె త్తిచూచును)

హను... అరుణరుచియైనదోసిట నచట నచట
జొటజొటన్ రాలి కన్నీటిచుక్క లెసఁగుఁ
దెగిన ముత్తియములజిగి నెగడుకతనఁ
గములగర్భంబునను హిమకణములట్లు.

సీత... భద్ర! నీదర్శనమాత్రమునన దైవ మభిముఖ మయ్యెనని తెలిసి కొంటిని. మఱియు నంగులీయకము తాఁకినంతనే యార్యపుత్రు నాలింగన మొనర్చుకొన్న ట్లయినది. ఇపుడు మరల వారి మాటలు విన నాహృదయము కుతూహలపడుచున్నది. అంతియకాని మఱియొక గుఱుతుకొఱకుఁ గాదు. ఆర్యపుత్రుఁడు నమ్మికకుఁగాఁ జెప్పినమాట చెప్పుమా!

హను... మాయాలోకమున నున్నమిమ్ము దృఢముగ నమ్మించుటకుఁ గా నిదియుఁ జెప్పెను-

"జా గొనరించి దీపమును నన్ను మొనర్చినవెన్క నీదుశ
య్యాగృహ మేను జేర మధురాంచితభాషల, 'దొంగ నీవు నిన్
బాగుగ శిక్ష సేతు,నని బాహుల విచ్చిన మల్లెదండలొ
నాగతి కట్టికట్టితివ యంతకు గట్టిగ నాదుడెందమున్!"

సీత... (సంతోషముతో) ఆశాలతా! ఇపుడు పూవు గట్టుము- మారుతి నీ కమృతసేచనము సేయుచున్నాఁడు! హృదయమా! ఆర్య పుత్రుఁడు నీలో నున్నాఁడు! జీవితమా! నీవు యమలోకము నకుఁ బోవుచు నగముదారిలోనే తిరిగివచ్చితివి!-.........

మారుతీ! యేమియో చెప్పవలయునని యున్నది; యేమి చెప్ప
వలయునో తెలియకున్నది. నీతండ్రి వాయుమూర్తి జగత్ప్రాణుఁడు;
నీవు నాకుఁ బ్రాణము నైతివి!

హను... (అధోముఖుఁడై నిల్చును)

సీత... వాయుకుమారా? అన్నట్లడుగ మఱచితిని - ఏయుపాయమున
మహాసముద్రము లంఘించి యిచ్చటికి వచ్చితివి?

హను... అమ్మా! తరువాతివృత్తాంతము వినుఁ. అపుడు వానరసైన్యము
ప్రభునాజ్ఞను దైవనిర్మాల్యముఁబలె శిరస్సున ధరించి యీ
దిక్కునకు బయలుదేరెను.

జలదసమావృతంబులగు క్ష్మాధరగహ్వరమధ్యసీమలన్
జలజలపాఱు నేళ్ళ యిరుచక్కిఁ దనర్చు వనాంతరంబులన్
జలనిధి యంతవట్టు కొనసాగెడు చెల్లెలికట్ట యంతటన్
బలితపుదీక్ష ని స్వెదకి హాకు కపీశ్వరు లింతకాలమున్.

తరువాత గడువు దాటవచ్చుటచే వానరపతు లెల్లరుఁ బ్రా
యోపవేశన మొనర్చిరి.

సీత... అయ్యయ్యో!

హను... అపుడు జటాయువు సోదరుఁడు సంపాతియను గృధ్రరాజు
మాటఁబట్టి మే మున్నతావునకు వచ్చెను.

సీత... వచ్చి?

హను... స్వామినీ! నీయునికిస్థానము గలిసి మెలసి యున్నవానివలెఁ
గన్నులకుఁ గట్టినట్లు మాకుఁ దెలిపెను.

సీత... ఆహా! ఉపకారపక్షముగదా యీజాతి! ము న్నితనిసోదరుఁడు
తాతజటాయువు నాకారణమునఁ బ్రాణములు వదలెను.

హను... ఆమహానీయుని యుపదేశముచే మహార్ణవము దాటితిని;
ఈయుద్యానవనమును జేరితిని.

సీత... నీవు నాశోకసాగరమును దాటితివి. వ్యసనకర్ణధారా! మారుతీ!
చెప్పుమా యీవ్యసనమునకుఁ బర్యవసానకాల మున్నదా?

[redacted]

హను... అమ్మా! ప్రభువు సందేశించియున్నారు.

సీత... ఏమి నాకు సందేశకూడకు నున్నదా? అనుగ్రహింపఁ బడితిని.

హను... ఇది భర్తృసందేశము-

'ధనువు వంచి మున్ను ధరణీశుసభలోన
గురుగృహంబునుండి గొంటి నిన్ను;
ధనువువంచి యిప్పుడును యుద్ధరంగానఁ
గొందు నిను దశాస్యుబందినుండి.'

సీత... రాక్షసుని ప్రాణములు తొలుత గ్రహించి పిదప నన్నుగ్రహించు నా యార్యపుత్రుఁడు? అయిన నీవు డేల విలంబింతువు? వేగమే వెళ్ళుము. ఋషియనుగ్రహమగు నీచూడామణి నందుకొనుము. (తనలో) ఆర్యపుత్రుఁ డిది చూచినా నాయపేక్ష నెఱుంగఁగలఁడు.

హను... (తనలో) ఓహో! దేవియుచితజ్ఞతయుఁ బరేంగితజ్ఞానమును. (వెలికి) దేవి యనుగ్రహించుఁగాక (అందుకొనును)

సీత... ఆర్యపుత్రుఁ డెట్లయిన శోకపరవశుఁడుగాఁడో యట్లు నావృత్తాంతము వారికిఁ జెప్పవలయు.

హను... అనుగ్రహము.

సీత... నీ విపుడ వెళ్ళుము. నేను తొల్లిటివలెనే శింశుపాసంశ్రితనై మీావృత్తాంతము ప్రతిపాలించుచుందును.

హను... దేవియాజ్ఞ.

పాణిం గొన్నధనుస్సు దైత్యవధతో వర్జించి గోధాంగుళి
త్రాణస్థానములం గిణాంకములతో రాజిల్లుచుఁ నిత్యక
ల్యాణశ్రీకలశాతపత్రవరరేఖాన్వితమా కేల నీ
వేణీభారము శ్రీరఘూద్వహుఁడు దేవీ! చిక్కడల్చుం జుమీ!

సీత... నీ కవిఘ్న మగుఁగాక; (నిష్క్రమింతురు)

---

అంగుళీయాంకము

విష్కంభకము

(విద్యాధరుఁడు ప్రియురాలితోఁ బ్రవేశించును)

విద్యా... సౌదామిని ! నే నిందనుక విద్యాదైవతము నారాధించుటచే మహేంద్రసేవాకాల ముపలక్షింపలేదు. కాన నీ వలసియున్నను నన్ననుసరించి రావలయును. వేళమించకుండ వేగముగాఁ బోవుదము.

సౌదా... వచ్చుచున్నాను!

విద్యా... రమ్మ సౌదామినీ !

వలచుపూదండ మెఱుపులవాసిఁ బెంపఁ
గమ్మల హారంగు హరివిల్లుకాంతి నింప
నొప్పునీకొప్పు క్రొమ్ముగు లొప్పులాఁడి!
బిగ్గ బంధింపు; ధరియింపు బిగుతు రైక.

[ఇద్దరు నాకాశయానము నిరూపింతురు]

విద్యా... సౌదామినీ ? చూడు చూడు !

కొండకోననుండి, కాటుకగుండయట్లు
నీలరుచిరమైననింగికి నెగయు మసకు
వసుధ గన్పట్టుచున్నది వరుస వెట్టి
తనపదార్థముల్ తాన మ్రింగునదివోలె.

సౌదా... ఆర్య ! కులపర్వతము లిపుడు కన్పట్టియుఁ గన్పట్ట నట్లున్నవి.

విద్యా... ఆహా ! అధ్వగమనము నాకెంత శోభనమైయున్నది ! ఒక వంకఁ బ్రియాపయోధరస్పర్శము! ఇంకొకవంక దిగ్వధూపయోధరస్పర్శము!

మరకతచ్ఛవియగు మేఘమార్గమందు
మై స్పృశించెడు స్వర్గీయమారుతములు;
కంకణమణీవినిర్గతకాంతివితతి
నొరయుచుదు న్నను సజలమేఘోదరముల.

[నేపథ్యమున]

దనుజులతోఁకు నందని హుతమ్మిఁక నగ్నివహించుఁగాత; వ్యో
మనది మునింగి సప్తఋషిమండలి సంధ్యజపించుఁగాత; సూ
ర్యుని హయరాజి మందరము నొందుత సూటిగ; వీడుఁగాత వం
చనభయముల్ సతీవితతి; స్వర్గ మనర్గళ మౌత మాపయిన్ !

విద్యా... ప్రియా! ఇది జగద్ఘోషణవలె నున్నది! అదే ఋక్షేశ్వరుఁడు తాత జాంబవంతుఁ డిటువచ్చుచున్నాఁడు.

(తరువాత భేరి మ్రోఁగించుచు జాంబవంతుఁడు ప్రవేశించును]

నముచిం జిమ్ముచు తీవ్రన న్నగము శ్రీనాళీకపత్రాక్షుపా
దముపొంత న్నడయాడుచుం బొటిబొటిన్ దాటించితిన్ మందభ
గ్రమత న్నేఁడును రావణుం దునిమి శ్రీరాముండు తొల్లింటి కా
ర్యమున న్నన్నను బూన్చె- లోక ముచితవ్యాపార మర్థింపదే !

ఈ భారము మిక్కిలి గొప్పది; యోర్పుగ నెఱవేర్తును.

[దనుజులతోఁకునందని హుతమ్ము- అను పద్యముఁ జదివి నిష్క్రమించును]

విద్యా... ప్రియా ! ఇది జగత్ప్రియము. రావణుఁడు కడతేఱె నాఁడు!

సౌదా... హృదయము చల్లఁబడినది. దివస మతిక్రమింపఁగా వార్త పుట్టినది- రాముఁడు రావణునిదక్కఁ దక్కిన రాక్షసకులము నెల్ల నిశ్శేష మొనర్చెనని.

విద్యా... ఇపుడా కొఱయుఁ దీఱినది మువ్లోకములు నుద్ధృతకంటకము లైనవి.

సౌదా... ఇప్పుడు పతివ్రతలహృదయముల కుచ్ఛ్వాసము కలిగినది.

విద్యా... ఇప్పుడు కోరిన కోర్కె నెఱవేఱుటచే సంఫుల్లాత్ముఁడగు సహ స్రాక్షు సంభావింతము.

(నిష్క్రమింతురు)

## —సప్తమాంకము—



[సన్నాహవేషముఁ దీసి శ్రీరాముఁడు లక్ష్మణ
విభీషణసుగ్రీవులతోఁ బ్రవేశించును]

రాము... మిత్రమా! విభీషణా!

పట్టణమ్ముఁ బ్రవేశింపు; ప్రభువు లేని
ప్రజల వీక్షింపు; యుక్తకర్మములఁ దీర్పు;
గొప్పకడగండ్లలయఁ దమకొలమువారి
నారసి సమాశ్వసిల్లుఁ గా పౌరవితతి.

విభీ... ప్రభువు ప్రసన్నుఁడగుఁగాక! నేను బంధుస్నేహము లేక చెప్పు
నది కాదు-

సాధుజన మేడ? మేము రాక్షసుల మేడ?
అయిన నన్నలరించు మీయాశ్రయమ్ము
దెప్పరపుఁబంట నిల్కడదప్పుదంట
కాదు తరితీపు నా కన్నగారి కలిమి.

రాము... ధర్మము కాదిది; సిరిరా మోకా లొడ్డరాదు.

సుగుణభూషణ! నీయన్న విగతగుణుఁడు
మించి నీతోడనే వెలారించినట్టి
ధర్మ మిప్పుడు నీచుపదమ్ము నంటి
పదము మోపుతఁ బౌలస్త్యపదములందు.

విభీ... దేవ! ఇది మొదలుగ—

స్థానమైతిని నేను సమ్మానమునకుఁ
గరుణ విరిసిననీచూడ్కి వారయఁ గనుట
హారుఁడు చేకొంట మసనంపుటగడుపుజేయఁ
దాల్చుచున్నారు బుధులు మస్తకములందు

రాము... మిత్రమా ! సుగ్రీవా ! నీసఖుఁడు విభీషణుఁడు పర్యాకులుఁడై యట్లున్నాఁడు. కృతకరణీయుఁడగు నీతని లంకాప్రజలతోఁ గలుపుము.

సుగ్రీ... దేవర యాజ్ఞ. లంకేశ్వర ! రమ్ము.

[సుగ్రీవవిభీషణులు నిష్క్రమింతురు]

రాము... విభీషణప్రతిష్ఠాపనమువలన నే నిపుడు కృతార్థుఁడ నైతిని. ఏమన-

కానలువాఱెడు నర్థులకోర్కె దీవ
నిష్ఫలంబగు నేని సాన్నిధ్యమునను
వానిసంపద నటుని సంపదవిధాన
ఛత్రచామరమాత్రలక్షణము గాదె ?

[ప్రవేశించి]

సుగ్రీ... జయము దేవా !

రాము... సుగ్రీవ ! వెళ్ళిన వెంటనే వచ్చితి వేమిది ?

సుగ్రీ... దేవ ! ఇది విభీషణవచనము-దేవి యెందనుకఁ బట్టణమునుండి నిష్క్రమింపదో యందనుక నేను బట్టణము ప్రవేశింపనని.

రాము... (సబహుమానముగ) అట్లయిన నీవె నీసఖుని గొని రమ్ము.

సుగ్రీ... ప్రభువునాజ్ఞ. (నిష్క్రమించును)

(సవిత్కరముగా)

రాము... వాలిం జంపి మహార్ణవమ్ము నచలవ్రాతమ్మునం గట్టి యెట్లో లంకాపురిఁ జేరి బాంధవసహాయోపేతునిన్ రావణుఁ నేలం గూల్చి కపీంద్రమాటపయి దేని న్నే నిరీక్షింతు నా రోలంబాలక యున్కిఁ బొందదుగదా లోకాపవాదాపదన్.

లక్ష్మ... ఆర్యుఁడు ప్రసన్నుఁ డగుఁగాక.

స్త్రీస్వభావంబు సుఖము వాంఛించుచుండు;
దుర్వినీతులు ఖలులు దైత్యులు కరమ్ము;
మనము దూరస్థులము; కాన మనవి సేతు-
ప్రభు ! పరీక్షింపఁదగు దేవిభావశుద్ధి.

రాము... లక్ష్మణ ! హనుమంతుఁ డెక్కడ ?

లక్ష్మ... అతఁ డిపుడు యుద్ధభూమియందు-

చిమ్మిన శైలముల్ తొలఁగఁజిమ్ముఁ గపీంద్రుల లేవనెత్త; బిం
కమ్మున లాగు రాక్షసముఖంబులఁ జిక్కినబుక్కరాజులన్;
నెమ్మదిమై వలీముఖుల నిర్ఝరవాహుల సేదదేర్చు; సం
ద్రిమ్మరనున్న నక్రములఁ దవ్వును దైత్యకళేబరంబులన్.

రాము... ఇతని కీపని తగియే యున్నది.

(నేపథ్యమున)

తొలఁగుఁ డార్యులారా ! తొలఁగుఁడు.

రాము... లక్ష్మణ ! ఏమిది ?

లక్ష్మ... ఆర్య ! ఇది యార్యురాలి యాగమనము.

రాము... దేవినిగూర్చి మహాజను లేమందురోగదా! లక్ష్మణా! సుగ్రీవు నాజ్ఞాపింపుము 'ప్రజలఁ దొలఁగింపవలదు. యానమునుండిడింపి మైథిలిని వెల్లడిగఁ గొనిరావలయు' నని.

లక్ష్మ... చిత్తము. (నిష్క్రమించును)

రాము... దైత్యవిభుఁ బంక్తివదను నధఃకరించి
నన్ను మనసార సేవించుచున్న జనక
పుత్రి రూపమ్ము చారిత్రభూషణమ్ము
సర్వజన మారయుంగాక జంకులేక !

[తర్వాత సీత లక్ష్మణసుగ్రీవులతోఁ బ్రవేశించును]

[నేపథ్యమున]

ఓహో ! లక్ష్మణసుగ్రీవుల సాధ్వాచారము !
దూరానతశిరు లౌచు నమ
స్కారము నొనరించు వీరిసదములదృష్టుల్
తీరుగఁ బడుచున్నవి వ
హ్వారే ! యీ రాజకన్యపాదములందే !

సీత... మహాజనము న న్నెట్లు తలంచునో ! ఆర్యపుత్రుఁడు న న్నెట్లు తలంచునో ! స్త్రీస్వభావము నమ్మఁదగనిదిగదా! ... అధన్య నగు నాకొఱకుఁగా ననర్థసాగరమునఁ బడిన యార్యపుత్రుఁ డాత్మీయ బాహువుచే ను త్తీర్ణుఁడయ్యె-మారుతి నిజమే చెప్పెను-మొదట ధనువుచేఁ బరిగ్రహించినదాని నిపుడును ధనువు చేతనే యుద్ధరింపఁ గలఁడని.

[అందఱను సమీపించి]

లక్ష్మ... ఆర్య ! జయము.

సుగ్రీ... దేవా ! జయము.

సీత... ఆర్యపుత్ర ! జయము.

రాము... దేవి ! ఇటు—(అర్ధోక్తియందే మోము త్రిప్పికొనును)

ఉభయులు... ఏమి చెపుమా యిది !

రాము... లక్ష్మణ ! హనుమంతుని బిలువుము.

లక్ష్మ... చిత్తము. (నిష్క్రమించును)

రాము... సుగ్రీవ ! నీ వీమెను మున్ను జూడలేదు,

(సుగ్రీవుఁడు భీతుఁడై నిల్చును)

రాము... ఇప్పుడు చూడుము మున్ను జూచి యెఱుఁగని విరహచరిత్రమును-

చందనపుఁబూఁత చక్క నెడంద నెసఁగఁ
గడు గుబాళించువిరులు కొమ్ముడిఁ బొసంగ
మించు చెంగావిచీర ధరించి యీప
తివ్రత వహించు బళి విరహవ్రతమ్ము!

సుగ్రీ... దేవ ! అతిగౌరవదోషమున నే నీమెను దేవర యెదుటకుఁ గొనివచ్చితిని.

రాము... నిజము లక్ష్మణుండును జూచియుండఁడు.

సీత... అయ్యో! అనసూయాదేవి యనుగ్రహముకూడ నా కిపుడు శాప మైనదే !

[లక్ష్మణుఁడు హనుమంతునితోఁ బ్రవేశించును]

లక్ష్మ...జయ మార్యా!

హను...దేవ ! జయము !

రాము...లక్ష్మణా! చూడుఁ డీమెను నీవును హనుమంతుఁడును-

[ఇర్వురును సీతను జూచి మొగము ద్రిప్పికొందురు]

హను...దేవ ! లంకలో నేను జూచినయామె వేఱు; ఈమె కాదు.

సీత...ఆర్య ! ఒకమనవి !

రాము...నీరూపమే మనవి సేయుచున్నది.

సీత...కుమారా ! నామాటవినుము.

లక్ష్మ...నీమాట వినుటకు ఫలమే యిది.

సీత...వినుము మారుతీ !

హను...గతించిన దాకాలము.

రాము...ఈమె యింకను నాయెదుట నిల్చియున్నదా ?

దినదినంబును సంకేతమున నిశాట
విటులను విరాళిఁ గవియుచు విటుకులాఁడి !
దండకాటవిఁ గికురించి యుండు దేమొ
వెడఁగుబడుగుల ఋజుభావజడుల మమ్ము!

[నవ్వుచు]

సీత...ఆర్యపుత్త్రుఁడును బరుషముగ మాటలాడుచున్నాఁడు !

సుగ్రీ...భర్త పల్కినయీకానిపల్కు వినియు
పక్కన నవ్వుచున్న దీపడఁతి తార !
కాంత లందఱిలోన నీకాంత మిగుల
నధమ కానోపుఁ; గానోపు నధికురాలు.

ప్రభుసన్నిధినుండియీమెను వెడలింపఁబడుఁగాక. చితాగ్నికిక్కీ రాహుతి యేల ?

లక్ష్మ...ఈమెను శరీరముతోఁ బంపరాదు.

హను...దేవర యీమెకుఁ దగినదండము విధింతురుగాక;

సీత...ఆర్యపుత్రు డనుమతించిన నగ్నిఁ బ్రవేశింపఁ గోరుదును.

రాము...లక్ష్మణ ! ఈపతివ్రత యిచ్చను నెఱవేర్పుము.

లక్ష్మ...చిత్తము. (తనలో) ఇపుడు సంతోషముగ నున్నది. (వెలికి) దేవి ! రమ్ము.

సీత...హృదయమా ! ఆర్యపుత్రునిపాదములకుఁ బ్రణమిల్లుము.

[లక్ష్మణుఁడు సీతయు నిష్క్రమింతురు]

రాము...సుగ్రీవా ! నీవును హనుమత్ప్రముఖసైన్యముతోఁ గూడి హతశేషులగు రాక్షసులనుండి కుమారుని రక్షింపుము

సుగ్రీ...దేవరయాజ్ఞ.

[సుగ్రీవుఁడు హనుమంతుఁడు నిష్క్రమింతురు]

రాము...ఏమిచెపుదూ ప్రత్యక్షమునుగూడ నప్రమాణ మొనర్చి నా మనము సీతయెడ సబహుమాన మగుచున్నది?విడిచియు విచారింపనేల? కేవలముగ లోకహితార్థమే నాయత్నము.

(కంటకితసర్వాంగుఁడు లక్ష్మణుఁడు ప్రవేశించును)

లక్ష్మ...ఆశ్చర్య మాశ్చర్యము!

రాము...వత్స! లక్ష్మణ! మేఘాంతరచరుఁడగు మేఘనాథునింద్రజిత్తును జయించినవాఁడవు. అట్టి నీగాత్రయష్టియుఁ గంటకిత మయ్యెను. చెప్పుచెప్పు యెందుండి యీయావేగము?

లక్ష్మ...ఆర్యపాదుల శాసనమున సముద్రతీరమునఁ గాసారదారుని కరముల నగ్ని ప్రజ్వరిల్లఁ జేసితిని. అంత దేవి ప్రళయాగ్నివలె నంతట జ్వలించుచున్నయగ్నికి ముమ్మాఱు ప్రదక్షిణ మొనర్చి నీకును నయోధ్యావాసులగు గురుజనులకును బ్రణమిల్లి నన్నుఁ జూచి యిట్లే గురువచన మొనర్చువాఁడవు కమ్మని పలికి భరతశత్రుఘ్నుల కిట్లే చెప్పుమని చెప్పెను. తరువాత నామె యిట్లన్నది - భగవంతుఁడా ! అగ్నిదేవా ! నీయెదుట నేను సత్యము చెప్పుచున్నాను. వెకలునప్పుడు రాక్షసభుజస్పర్శ

మైనది. లంకయందు పాదస్పర్శ మైనది. అని నిర్విశంకముగ
జలముంబలె జ్వలనముం జొచ్చెను.

రాము... ఆశ్చర్యము!

లక్ష్మ... అపు డాకసమున శంఖపటహములు ప్రవర్తిల్లినవి. అంత-
రావుల నిల్చి మేము స్తిమితంబగుచూడ్కులఁ జూడ నంతటన్
ప్రావృష వైద్యుతవ్యతికరప్రభ వెల్గెడునూపుఁ దాల్చి నీ
దేవి వసుంధరాత్మజ సతీమణి మున్నిడికొంచుఁ బేర్మిమై
దేవముఖమ్ము శ్రీజ్వలనదేవుఁడు కట్టెదుటం గనంబడెన్.

వేలావనకుసుమితతరు
జాలము విడి నింగి నలుపు నలుపం దేఁటుల్
వేలుపుఁ గ్రొవ్విరి వానలు
చాలుగఁ బడెఁ గన్నమొరగె జ్వలనం డంతన్.

రాము... ఆశ్చర్యమే! రమ్ము. చూతము.

(ఇర్వురు పరిక్రమింతురు)

(నేపథ్యమున దివ్యగంధర్వులు గాన మొనర్తురు)

ముల్లోకముల గర్భమున నొక్కమూలఁ
జల్లగా వర్ధిల్లుచాడ్పునం దాల్చి
యోగనిద్రారతి నుదధిమధ్యమున
భోగీంద్రశయ్య నొప్పుగఁ బవ్వళించి
హోతయు హవ్యమ్ము హుతవహుం డనఁగ
నీతఁడే యని శ్రుతు లెన్నఁ బొల్పారు
నారాయణుండవు నళినాక్ష! నీవు
శ్రీరమాదేవి ధాత్రీపుత్రి సీత!

(నేపథ్యమున నితరులు గాన మొనర్తురు)

హిమరుచిం బోల్చు నిందిరగ జేందరికన్న
చామరము దానమున నల్పునల్పి చదల

సురనదీపద్మరేణుభూసరిత మైన
మారుతము నీరణశ్రమ మాన్పుఁగాక!

రాము... అశ్రుతపూర్వ మీగాత్రమురాగము!

(ఉభయులు నాకసముఁ జూతురు)

రాము... లక్ష్మణ! చూడుచూడు. భూమ్యాకాశములు పరిభానులేప
ములవలన నూతనములై కన్పట్టుచున్నవి-
సేతుశైలంబు లివి మేరుశృంగము లటు,
లీవనావళి కల్పవనావళిగతిఁ,
గనకకాంతుల మించు నీకపిచయమ్ము
మెఱుఁగు వెట్టినరీతిని మెఱసె నిపుడు!

(నేపథ్యమున)

నేను నారదుఁడ; దేవశాసనమున వచ్చుచున్నాను.

(ఇర్వురును సవినయముగ నవలోకింతురు)

(ప్రవేశించి)

నార... జయము జయము కారణమానుషుఁడగు రావణాంతకునకు.

రాము... లక్ష్మణా! నమ్మరాని యాశ్చర్యముఁ జూచుచున్నానే!

నార... ఇంతకంటెను ఆశ్చర్య మేమి? ఎల్లరకు నభిగమ్యులగు నింద్రాది
దేవతలు స్వయముగ రావణుని లంకకు వచ్చుచున్నారు.

రాము... కావున నేప్రభాప్రవాహము! భగవత్ప్రసాదమునఁ బ్రపూతుఁ
డనైన నన్నన్యునివలెఁ జూచుచున్నాను.

నార... ఏనిమహిమ మక్షరమూర్తి ఋషి. నుతించు
వేయితెఱఁగుల కర్మముల్ వేనినెనయు
లోకభర్త మేథాతిథి మేకమఘవుఁ
డశనికేతు వహాంవర్షి యాతఁడె యితఁడు.

రాము... భగవంతుఁడగు మహేంద్రునకుఁ బ్రణామము.

నార... నలుపుం జాయల మించు కంఠములతో నాగేంద్రహారాళితో
జ్వాలనోద్యత్కణగర్భనేత్రములతో భాసిల్లుచున్నారు వీ
రలె రుద్రుల్ పదొకండు చంద్రకళలం బ్రత్యేకముం దాల్చి యా
వల శేషించిన వానిచూర్ణముఁబలెన్ భస్మంబు మైఁ దాల్చుచున్.

రాము... వర్ణోత్తములగు దేవతలకు నమస్కారము.

నార... వీరు వసువులు- వీ రశ్వినులు.

రాము... లోకహితపరాయణులగు దేవతలకు నమస్కారము.

నార... మనువు మొదలుగ దశరథావనిపుదాఁక
వెలయు నీపితృదేవతల్ వీరె చూడు
మింద్రుఁ డిడుకల్మి రోసి నీవిచ్చుపిండ
మును నిరీక్షింతు రాసమై దినదినంబు!

రాము... వీరె లక్ష్మణా! మననాన్నగారు చూడు
కౌఁగిలించుచున్నారు దృక్తతిని మనల;
సత్యము నచంచలముగ రక్షణ మొనర్పఁ
బ్రాణములతోడ నన్నును వదలినారు!

లక్ష్మ... ఆర్య! స్వప్నమువలెఁ బొడగట్టుచున్నది!

రాము... భగవంతుఁడా! దేవతలు ఋషులు పితరులురాఁ గారణమేమి?

నార... నీదేవియగు సీత పాతివ్రత్యానుభావము.

రాము... ఈయద్భుతదర్శనమే నాకు విశ్వాసకారణము. అయినను
నన్నింకను సందేహపఱచుచున్నది యీమహోపశోభానిమిత్తము!

నార... ఏమేమి? ఎఱుఁగవా యీమహారూపశోభకుఁ గారణము?

రాము... భగవంతుఁడా! యెఱుఁగను.

నార... మహర్షిపత్నియగు నాయనసూయాదేవి వరప్రసాదముకదా!

రాము... దండకారణ్యమందును నాకిది సందేహాస్పదమయ్యెను!
పరమార్థముగనైతిని.

నార... ఆమెకు శరీరగతమైన దేదియు నీదర్శనమార్గమున నలంకార
రూపమగుచు. కావున నే.

నేలఁ బండెడునో సంటుదూలి యదియె
పాలఁతిమేనికి గంధపుఁబూఁత యయ్యెఁ;
నా శ్రమమహీజముల రాలు నాకు లవియె
కలికిముంగురులకు నలంకార మయ్యె!

రాము... దేవశాసనము నెఱవేఱెనది. సత్యవాదివియు సమాధిచతురుం
డవునగు నీవే ప్రమాణము.

లక్ష్మ... (తనలో) ఓహో! మందబుద్ధులమగు మేము వచనవిస్ఫులింగ
ములచే రుప్పినను మహాదేవి వికృతి నంద దయ్యెను!

రా... భగవంతుఁడా! దేవతలుఁ బితరులు మహర్షులు నే మాజ్ఞాపించు
చున్నారు?

నార... 'రావణజీవితముతోఁగూడ నీవనవాసము సమాప్తమైనది.
కావున దేవితోఁగూడ నయోధ్యాపురముఁ బ్రవేశింపు' మని.

రాము... అనుగ్రహింపఁ బడితిని.

నారా... కాన దేవిని గొనిరా లక్ష్మణు నియోగింపుము.

రావ... (జనాంతికముగ) లక్ష్మణా! ఇపుడు కర్తవ్య మేమి?

లక్ష్మ... ఇంకను బరీక్షింపఁదగిన దేమి? ఆమె పరిశుద్ధికి దేవతలుఁ
బితరులు మహర్షులును సాక్షులు.

రాము... (వెలికి) లక్ష్మణా! మహర్షి శాసన మనుష్ఠింపుము.

లక్ష్మ... చిత్తము. (నిష్క్రమించును)

నార... ఓహో! నీయనుభావము విస్మయనీయము!

రావణుండు త్రైలోక్యవిద్రావణుండు
నీధనుస్సున నిప్పుడు నీర్గెఁ గాన

నోయి రఘువీర! హరిధను స్సౌకట జలధి

మహితమండలమండనమాత్ర మగును.

రాము... దానికి దేవతలు మునులే కారణము.

(తరువాత సీతయు లక్ష్మణుడును ప్రవేశింతురు)

సీత... శోచనీయ నావృత్తాంతము- కాదుకాదు- సంతోషకారణమే. ప్రస్థానసమయమున నెట్లో యాపాపుని హస్తస్పర్శమును లంకయందు బాదస్పర్శమును గలిగినవి. ఆపాపుని శరీరస్పర్శముచే భ్రష్టములగు గాత్రము లగ్నిచేగాక యింకెట్లు పరిశుద్ధములు కాగలవు ?

రాము... దేవీ ! ఇటులిటు-

ధర్మశీలవయ్యు ధరణిజా ! నాచేత

సంశయింపబడితి నసంగతముగ;

నెటులు విశ్వసింతు రెడబాటు ఘటియిల్ల

దక్కుచెలుల శంకదక్కి ప్రియులు ?

సీత... ఆర్యపుత్రుడు యదార్థము నెఱుంగును.

రాము... దేవి ! అనురక్తుడనైన నాయవిశ్వాసము ఫలవంతమే యైనది. దేవతలును పితరులును మహర్షులును ప్రత్యక్షమైరి.

(తరువాత కృతాభిషేకుడు విభీషణుడు ప్రవేశించును)

విభీ... దేవా ! జయము జయము.

రాము... విభీషణా ! లంకావార్తలేమి?

విభీ... లంకయందలి మహాజన మెల్ల ప్రభునిగూర్చి యాక్రోశించుచున్నది.

రాము... ఏమేమి ? (వ్యాకులుడై నిల్చును)

విభీ... 'పాలలో గల్లు కలిసెనని శంక గలినది! మేలిమిబంగార మగ్గిలో

వేయనేల ? చీఁకటి దివ్వెను వలుపు సేయఁగలదా, యని.

రాము... జనవాదము వినుటచే నిపు డూఱట కల్గినది.

విభీ... దేవ ! నాగరికులు మహాదేవినిగూర్చి వంచిన తలల నింకను నెత్తలేదు.

రాము... సీత యెంతమహానుభావురాలో తెలిసికొంటిని.

విభీ... మఱియు పూజ్యుఁడగు కుబేరుని సొత్తిది!

పుష్పశరసమాన ! పుష్పకాఖ్యవిమాన
వసతి యిదియె సుగుణవసతి ! చూడు!
ముజ్జగమ్ము గొనియు ముజ్జగమ్మునుగొన
నాశపోలె నావకాశ మగును!

రాము... లోకపాలుఁడగు పూజ్యునకుఁ గుబేరునకుఁ బంపివేయుఁడు.

నార... కాదు కాదు. రాక్షసుఁడు కలకాల మనుభవించుటచే మలీమసమగు నీవిమానమును దేవియు నీవు నారోహించుటచేఁ బవిత్రీకరించి తర్వాత నయోధ్యనుండి కైలాసమునకుఁ బంపుఁడు.

రాము... చిత్తము లక్ష్మణా ! మొదట దేవిని రథ మెక్కింపుము.

లక్ష్మ... చిత్తము.

[సీత చకిత యగును]

రాము... (నవ్వి)

కలికిరో ! నేను రాముఁడనుగాని దశాస్యుఁడఁగాను; నీ రథస్థలికి నయించువాఁడు సహజన్ముఁడు- సూతుఁడు గాఁడు నమ్మవీ పలుకు లిఁకేటికీ? వికచపద్మదళాయుణమా కరాంగుళిన్ వెలయుచునున్నదే యిది యనింద్రితముద్రిక భద్రికాంతియై !

సీత... ఆశ్చర్యమణులకు నిదే యంజలి. లేకున్న నిపు డెట్లార్యపుత్రుని రాక్షసుని బరమార్థముగ నెఱుంగుదును ?

లక్ష్మ... అమ్మా! నీశాసనమున నాఁడు దండకాటవిని నిన్నువిడిచి నేఁ

బోవుచో-

నాత్రవతమె నన్నుఁ గాచు బాణములుగావు

దైవమే సాక్షి యంటి యథార్థ మయ్యె!

నపుడు సామాన్యదృష్టి నే నన్నమాట

నైపు మీచరణమ్మలే శరణ మమ్మ. (ప్రణమిల్లును)

సీత... కుమారా ! లెమ్ములెమ్ము. ఇంచుఁ ద ప్పేమి ? రక్కసునితల

త్రొఁక్కుటచే పాంసులములగు పాదము లిపుడు కుమారినిచేఁ గ

డుగఁ బడినట్లు పరిశుద్ధము లైనవి.

(నేపథ్యమున)

దేవరయు దేవి నెఱపు ప్రభావమహిమ

బళిర! యతిమానుషం బౌచుఁ బరిఢవిల్లె;

ఆతఁ డాత్మనిశ్చయము నిరాకరించె;

ఆమె యవికారయై యగ్నియందు నిలిచె.

నార... భద్రముఖ! భగవంతుఁ డగ్ని దేవుఁడే నీ కిపుడు సాక్షి యయ్యె!

(ఆకసమున శంఖపటహములు - ఎల్లరు నాశ్చర్యమునఁజూతురు)

నార... భద్రముఖ! స్వనిష్క్రమణముచే దేవతలు నీనిష్క్రమణమును

ప్రేరేపించుచున్నారు.

రాము... రమ్ము వైదేహీ!

మంగళ మొసంగ దేవి నమస్కరింపు

దేవశాసనశంసి నీదేవఋషిని;

వేద ముప వేదములతోడ బోధిసేయ

బ్రహ్మచేఁ బాత్రముగఁ జేయఁబడిన ఘనుని!

(చేయిపట్టుకొని చూపును)

- ౮౮ -

సీత...(నమస్కరించి) ఇపు డార్యపుత్రుని చేయి తాఁకుటచే నద్భు
తాంగుళీయకము ప్రమాణ మైనది. రాక్షసమాయనుండి
విడుమర గాంచితి నని తలంచుచున్నాను.

రాము...మున్ను రాక్షసమాయచే వంచింపఁబడిన నాకు నాశ్చర్య
చూడామణి దేవిదెస విశ్వాసకారణ మైనది.

నార...భద్రముఖ! దేవతల ననుగమింతును. నీకుఁ గ్రమ్మఱ నేమి
ప్రియము చేకూర్తును?

రాము...కృతార్థుఁడను నేను! ఇంకేమివాంఛింతును? అయిన నిది
యగుఁగాక !

భరతవాక్యము.

అమరాధీశుఁడు మంత్రహవ్యముదితుండై చక్క వర్షించుతన్!
సుమబాణుం డపథమ్మునుండి మరలించుంగాత బాణంబులన్!
దమధర్మంబు నెఱింగి తాల్చెదరుగాతన్ ఱేండ్లు పట్టంబులన్!
విమలప్రజ్ఞ రహించుఁగాత సతమున్ విఘ్నంబులే కున్నతిన్!

ఓం తత్సత్.





అగ్నిపరీక్షాంకము.

# నాట్యభారతీగ్రంథమాలిక.

నాట్యకళాభిమానులారా!

రమారమి 2000 తెనుఁగునాటకము లమ్మకమునకు సిద్ధముగా నిప్పుడంగళ్లలో నున్నను, ఉత్తమనటులు ప్రదర్శింపఁ దగినవిగాని, విద్యార్థులు పఠింపఁ దగినవిగాని, కళాపారీణులు మెచ్చుకోఁ దగినవిగాని, జనసామాన్యము కని యానందింపఁ దగినవిగాని యెన్నో లేవు. నిరక్షరకుక్షు లగునాటకరచయిత లనేకులు ప్రబలి యసత్కథల నసభ్యరీతుల రచించి తక్కువధరల కందఁ జేయుచు లోకుల యభిరుచిని గలుషిత మొనర్చుచున్నారు.

ఇట్టియెడ మరల సామాన్యజనుల యభిరుచులఁ జక్కపఱచి, దేశమున నాట్యకళ పెంపొందింపఁ జేయవలయునన్న మొదట నుత్తమనాటకములఁ బ్రకటింప వలసియున్నది

అందు దేశకాలములఁ బట్టి సంస్కృతనాటకముల కగ్రస్థానము పొడగట్టుచున్నది. శాకుంతల మృచ్ఛకటికాదినాటకములు తెనుఁగుదేశమున విస్మరింపఁబడినను పాశ్చాత్యదేశములలో మిక్కిలి ప్రచారమున నున్నవి. తదుపాసనచే వారు దినదినాభివృద్ధి నందుచున్నారు. కేవలము శాకుంతలోత్తరరామచరిత్రాదులే గాక వానితో సమానములయ్యు నిందనుకఁ దెలిఁగింపఁబడని యుత్తమసంస్కృతనాటకము లెన్నో యున్నవి. వానిని సులభముగను రసవంతముగను బ్రయోగానుకూలముగను ఆంధ్రీకరించి కళోన్నతికై ప్రకటించుటయే యీగ్రంథమాలికసంకల్పము.

కేవలముగ సంస్కృతనాటకములేగాక - యన్యభాషానాటకములు, స్వతంత్రనాటకములు, ఉత్తమప్రహసనములు, విమర్శనలు గూడ నిందుఁ బ్రకటింపఁబడును.

కావునఁ గళాభిమానులీగ్రంథమాలిక చిరస్థాయిని యగునట్లు సహాయ్య మొసంగుదురుగాక యని ప్రార్థించుచున్నాను.

ఇందు సంవత్సరమునకు నాల్గునాటకములు ప్రకటింపఁబడును, తదనుబంధముగ నొక ప్రహసనమును ఒకవిమర్శనగ్రంథమును ప్రకటింపఁబడును. అనుబంధగ్రంథములలో సాధారణముగ నాడుచున్నకొన్ని నాటకములుగూడఁ బ్రకటింపఁబడును. చందాదారులు అనుబంధగ్రంథములఁ దప్పక పుచ్చుకొనవలయునను నియమము లేదు ప్రధానగ్రంథములు పుచ్చుకొనినఁ జాలు.

చందాదారులలో (ఏ)-(బీ) తరగతులు రెండున్నవి. సంవత్సరము చందా రూ 3 లును మొదటనే చెల్లించువారు (ఏ) తరగతి చందాదారులు. ఏపుస్తకమున కాపుస్తకము వీ, పీ, గాఁ బంపగా నందుకొనువారు (బీ) తరగతి చందాదారులు.

సంవత్సరమునఁ బ్రకటింపఁబడు 4 నాటకములును

| | | |
|---|---|---|
| (ఏ) క్లాసు చందాదారులకు. | పోస్టుఖర్చులతోసహా- | రూ 3 లు |
| (బి) ,, ,, | పోష్టుఖర్చులుగాక- | రూ 3 లు |
| ఇతరులకు— | ,, | రూ 4 లు |

అనుబంధగ్రంథములు చందాదారులకు తగ్గింపుధరల కియ్యఁబడును—

వెలువడినది — ప్రథమపుష్పము.
శక్తిభద్రకవిప్రణీతము— ఆశ్చర్యచూడామణి-

తా నున్నది— ద్వితీయపుష్పము.
దిఙ్నాగకవిప్రణీతము— కుందమాల-

ఇందలికథ సుప్రసిద్ధముగు కుశలవవృత్తాంతము. దీనిని జూచియే భవభూతిమహాకవి యుత్తరరామచరిత్రమును వ్రాసెను. ఉత్తరరామచరిత్ర మందు గవిత్వప్రౌఢిమ హెచ్చుగా నున్నను కుందమాలలో నాట్యకళ సమధికముగ నున్నది. దిఙ్నాగుఁడు కాళిదాసకవికి సమకాలికుఁ డగుటయేగాక తత్ప్రతిస్పర్ధి—

ఇంక నాతనినాటకముగూర్చి వేఱ చెప్పనేల ?

నాట్యభారతీభవనము, విజయనగరము.

సంపాదకుఁడు,
విశ్వనాథశర్మ.